


# విశ్వనాథ కవితా వైభవం

*

జువ్వాడి గౌతమరావు

# విశ్వనాథ
# కవితా వైభవం

కవిసమ్రాట్ విశ్వనాథవారి
కమనీయపద్యాలకు రమణీయ వ్యాఖ్య

వ్యాఖ్యాత :

## జువ్వాడి గౌతమరావు

ప్రచురణ



యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

# VISWANATHA KAVITHA VAIBHAVAM

SELECTIONS FROM KAVISAMRAT VISWANATHA
SATYANARAYANA'S POETIC WORKS
WITH A COMMENTARY

**By Sri Juvvadi Gouthama Rao**



**యువభారతి**

ప్రచురణ : 26

ప్రథమ ముద్రణ : 3,200

17 నవంబర్, 1974

ముఖపత్ర రచన :

**శీలా వీర్రాజు**

ముద్రణ :

**నాగార్జున ప్రింటింగ్ వర్క్స్, హైదరాబాదు**

ముఖపత్ర ముద్రణ :

**విస్టాస్ ప్రింటర్స్, హైదరాబాదు**

ప్రతులకు :

**యువభారతి**

5, కింగ్స్‌వే, సికిందరాబాదు-50000౩.

**లేదా**

**యువభారతి కార్యాలయం**

ఆంధ్రసారస్వత పరిషత్తు భవనములు

తిలక్ రోడ్, హైదరాబాదు–500001.

**వెల : రూ. 2-00 లు**

YUVABHARATHI IS GRATEFUL THAT :

The Paper Used In Printing This Book Was Supplied
by Government of India at Concessional Rates

# మా మాట

సమన్వయ దృక్పథం ప్రజాస్వామ్య పరిరక్షణకు తోడ్పడుతుంది. ఉత్తమ సాహిత్యాధ్యయనం సమన్వయ సాధనకు తొలిమెట్టు. బహుజన హితం కోసం, బహుజన సుఖంకోసం మనిషి ప్రతిభ వ్యక్తం కావాలి. మనిషిలో స్వతస్సిద్ధంగా, అంతర్నిహితంగా ఉన్న మానవత్వాన్ని జాగరితం చేయగలిగే శక్తి సాహిత్యానికే ఉన్నదన్న నమ్మకంతో, ఉత్తమ సాహిత్యాధ్యయనానికి అనువైన పుస్తక ప్రచురణ, సాహిత్య సమావేశాలు, గోష్ఠులు నిర్వహిస్తూ యువభారతి కడచిన పదేళ్లుగా తెలుగు ప్రజల సంస్కృతి వికాసానికి యథోచితంగా కృషి చేస్తున్నది.

ప్రాచీన, అర్వాచీన సాహిత్యాలతో దిఙ్మాత్రంగానైనా పరిచయం కలిగించాలనే ఉద్దేశంతో, సమకాలీన సమాజం ఎదుర్కొంటున్న సమస్యలను సునిశితంగా సమవేదనా దృక్కోణంతో పరిచయం కలిగించాలనే ఉద్దేశంతో యువభారతి 'సాహితీవాహిని' పరంపరను ప్రచురిస్తున్నది. ఈ పరంపరలో ఇంతవరకూ వెలువడినవి కేవలం సాహిత్యాధ్యయనానికి సంబంధించినవే. ఇక ముందు ముందు కౌటుంబిక, సాంఘిక, వైజ్ఞానిక విషయాలకు సంబంధించిన పుస్తకాలను కూడ ప్రచురించి పఠితృలోకానికి అందజేయడానికి ఏర్పాట్లు చేస్తున్నాము.

ఈ సాహితీ వాహిని పరంపరలో ఏడవ తరంగంగా 'విశ్వనాథ కవితా వైభవా'న్ని అందిస్తున్నాం. విశ్వనాథ సత్యనారాయణగారి సాహిత్య వ్యక్తిత్వాలతో పరిచయం కల్గించే పద్యాలు కొన్నింటిని ఏర్చి కూర్చి సురుచిరమైన వ్యాఖ్యానం వ్రాయించి వెలువరిస్తున్నాం. విశ్వనాథవారి ప్రతిభ సర్వతోముఖం. సాహిత్యం బహుముఖీనం. తెలుగు సాహిత్యంలోని అన్ని ప్రక్రియలను ఆయన

తన అతిలోక ప్రతిభతో సుసంపన్నం చేసినాడు విశ్వనాథవారు Conscious Artist. యువభారతి ప్రచురించిన 'మహతి'లోని తన వ్యాసంలో "నేను ఏమి వ్రాస్తానో నేను తెలిసికొని వ్రాస్తాను కనక, నేను వ్రాసిన దానిలో అనంత విషయములు నేను చొప్పించి వ్రాస్తాను కనక, అనాదినుంచీ ఈ దేశంలో ఒకటి జ్ఞానం అనిపించుకుంటూ వస్తున్నది, ఆ జ్ఞానం నా పాఠకులకు కల్పించి నేను సఫలుణ్ణై వాళ్లని జ్ఞానవంతులను చేస్తున్నాను అనే భావం నాకున్నది కనక ఈ భావం ఉన్నవాళ్లు చాలా మంది ఉన్నారని తెలుసును కనక" అంటూ వ్యంగ్యంగా మహోన్నత ఆదర్శ శిఖరాలను అందుకొన్న ఒక మహా రచయిత లక్షణాలను పేర్కొన్నారు. మన ప్రాచీన సాహిత్యంలోని విలువలను అందాలను రహస్యాలను సమకాలీన పఠితృలోకానికి సమర్థవంతంగా అందించిన మనీషి ఆయన. ఆయన నవలలేమి, కథలేమి, వ్యాసాలేమి, ఉపన్యాసాలేమి, మహా కావ్యాలేమి, ఖండ కావ్యాలేమి పఠితలకు ఆనందాన్నే కాదు, విజ్ఞానాన్ని కూడా ప్రసాదిస్తాయి. ఒక్క మాటలో చెప్పాలంటే విశ్వనాథవారి సాహిత్యం భారతీయ ఆత్మావిష్కరణానికి ప్రతీక. విశ్వనాథవారి సాహిత్యంతో పరిచయం విజ్ఞాన ప్రదమైన ప్రతిభతో పరిచయం. భారతీయ సాహిత్యకులలో ఆయన సంపాదించుకొన్న స్థానం ఎంత సమున్నతమైందో అయనకు లభించిన జ్ఞాన పీఠంవారి బహుమతి తెలుపగలుగుతున్నది.

ఆయన ప్రతిభా సర్వస్వమని చెప్పదగిన "శ్రీమద్రామాయణ కల్ప వృక్షం"లోని కొన్నిపద్యాలను ఏర్చి కూర్చి శ్రీ జువ్వాడి గౌతమరావుగారు చక్కని వ్యాఖ్యానం వ్రాసి సకాలంలో అందించారు. విశ్వనాథవారి కవితా హృదయాన్ని అందులోని రహస్యాలను కనుగొనజాలిన సహృదయులు, వ్యుత్పన్నులు శ్రీ గౌతమరావుగారు. శ్రీ గౌతమరావుగారు విశ్వనాథ వ్యక్తిత్వా నికి, సాహిత్యానికి అతిసన్నిహితులు, యువభారతి హితులు. మా సంప్రార్థనను అంగీకరించి శ్రీ గౌతమరావుగారు ఈ గ్రంథ రచనకు పూనుకొని మాకే కాదు యావదాంధ్ర కవితా రసజ్ఞులకు కృతజ్ఞతాపాత్రులైనారు.

"విశ్వనాథ కవితా వైభవమునకు ప్రదర్శించుటకు నే నెన్నుకొన్న పద్యము లన్నియు రామాయణ కల్పవృక్షము లోనివే. విశ్వనాథ వారనేక కావ్యములను రచించినను ఆయన ప్రతిభ కూలంకషముగా ప్రకటింపబడినది రామాయణ కల్పవృక్షములోనే. అనంత విధములుగా నుండు ఆయన రచన కిది

సంపూర్ణ పరిచయము కాదు. దానికి వేరే గ్రంథము సమర్థులైనవారు వ్రాయవలయును విశ్వనాథవారి కవిత్వము సామాన్యుల కందుబాటులో నుండదను భావము లోకములో నున్నది. సామాన్యు లనగా తెలుగు సాహిత్యముతో సామాన్య పరిచయ మున్నవారని యర్థమైనచో వారికి ఈ కవిత్వము అందుబాటులోనిదే యని నా యనుభవము. నేను వారిలో నొకడను గనుక. ఇది రచించుటలో శ్రీ కోవెల సంపత్కుమారాచార్యుల సహాయము నాకు కోరుటయే తడవుగా లభించినది. వారికి నా కృతజ్ఞతలు" అని శ్రీ జువ్వాడి గౌతమరావు గారు పేర్కొంటున్నారు. శ్రీ గౌతమరావుగారి రచనతోపాటు విశ్వనాథవారి మరికొన్ని అందమైన పద్యాలను కూడా అందించాలని యువభారతి అభిలషించింది - అందు కనుగుణంగా మా యువభారతి ప్రచురణలకు ప్రధాన సంపాదకులైన డా॥ జి.వి. సుబ్రహ్మణ్యంగారు ఈ గ్రంథానికి పీఠిక వ్రాశారు. మా ప్రచురణలకు ఆయన సంపాదకత్వం వహించడం మా అదృష్టం. యువభారతి అభిలాషను ఆయన మిక్కిలి ఔదార్యంతో నెరవేర్చినారు. వారికి మా అభివందనాలు.

సహృదయులు యువభారతి నిర్వహిస్తున్న కార్యక్రమాలకు రూపురేఖలు దిద్దడంలోను, వాటిని విజయవంతం చేయడంలోను యథోచితంగా తోడ్పడి తమ తమ శక్తియుక్తులను, ఔదార్యాన్ని, సాహిత్యాభిమానాన్ని ప్రకటిస్తారని ఆశిస్తాము.

ఇరివెంటి కృష్ణమూర్తి

17-11-1974

అధ్యక్షుడు

యువభారతి

# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగల్గినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

పక్షానికి ఒకమారు శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రభాషానిలయంలో సాహిత్య సమావేశాలను ఏర్పరచి, యువభారతి తన సభ్యులకు సక్రమంగా ఆలోచించే పద్ధతిని, అందంగా, శక్తిమంతంగా, అర్థవంతంగా మాట్లాడగలిగే సామర్థ్యాన్నీ, నైపుణ్యాన్నీ - ఎదుటివారి అభిప్రాయాలను సహనంతో వినే సహృదయాన్నీ, ఆలోచన రేకెత్తించి, వివేకాన్ని ఉద్దీపింప చేయగలిగే అధ్యయనశీలాన్ని అలవరచేందుకు వివిధ దృక్కోణాలతో రూపొందించిన కార్యక్రమాలనునిర్వహిస్తున్నది.

యువభారతి కడచిన పదేళ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు, వీలైనంత ఎక్కువమందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ఇంతవరకూ ఇరవైఐదు ప్రచురణలు ప్రచురించి లక్షా డెబ్బది వేలకు పైగా ప్రతులను తక్కువ వెలకు తెలుగు పాఠకుల కందజేయడం జరిగింది

భారతదేశంలో ఎక్కడున్నాసరే-యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలు పంచుకోగలిగేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో దాదాపు 7,500 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేశారు. డిశంబరు 1 నుండి ఈ ప్రణాళిక కొత్తరూపు దాలుస్తున్నది. ఇందులో కూడా సహృదయులు చేరి తమ సహాయ సహకారాలు అందజేస్తారని ఆశిస్తాము. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన శాశ్వత జీవిత సభ్యత్వ పథకాలలో భారతీ మిత్రులుగా దాదాపు 450 మంది, భారతీ భూషణులుగా 50 మంది చేరారు. సహృదయుల సహకారాన్ని ఆకాంక్షిస్తూ

17-11-1974

అధ్యక్షుడు

# ప్రస్తావన

"అల నన్నయ్యకు లేదు తిక్కనకు లేదాభోగ మస్మాదృశుం
డలఘుస్వాదురసావతార ధిషణాహంకార సంభార దో
హల బ్రాహ్మీమయమూర్తి శిష్యు డయినా డన్నట్టి దా వ్యోమపే
శలచాంద్రీమృదుకీర్తి చెళ్లపిళవంశస్వామి కున్నట్లుగన్"

తండ్రికి పేరు తెచ్చే కొడుకు కలగటం ఎంత విశేషమో గురువుకు కీర్తి తెచ్చే శిష్యుడు లభించటం అంత అదృష్టం. గురువుకు గౌరవాన్ని తెచ్చే శిష్యుడు లఘువుగా ఉండటానికి వీల్లేదు. లఘువైన శిష్యుడివల్ల గురువుకు కలిగే గౌరవంకూడా లేదు. తిరుపతివేంకటకవులు కవికులగురువులు. ఆ కవికులంలో వారి గురుపీఠం చలనంలేనిదే. అయితే ఆ కవికులంలో గురుకులాన్ని నిలుప గలిగిన శిష్యునివలన వారి గౌరవం ద్విగుణీకృత మౌతుంది. విశ్వనాథ సత్య నారాయణగారు వేంకటశాస్త్రిగారి సంప్రదాయాన్ని సమున్నతంగా పోషించిన విద్వత్కవి. ఆయన సమకాలీనకవికులంలో సమ్రాట్టు. సమ్రాట్టుకు సామర్థ్యం తోపాటు స్వాభిమానం ఉంటుంది; ధీశక్తితోపాటు ధిషణాహంకార ముంటుంది. అది అంతస్సారం లేని ఆడంబరం కాదు; ఆత్మజ్ఞానంతో కూడిన అభిమానం.

విశ్వనాథవారి పేరు స్మరించగానే వెంటనే స్మరణకు వచ్చేది పైపద్యం. అందులో ఆయన గురుభక్తికంటే ఆత్మప్రత్యయం అధికంగా కనపడుతుం దని కొందరు విమర్శకు లంటారు. అయినా, ఆపద్యాని కలంకారమంతా అందులోనే ఉందని అందరూ అంగీకరిస్తారు. విమర్శకులకు కూడా వ్యామోహాన్ని కల్పించే విచిత్రమైన శక్తి విశ్వనాథవారిఉక్తిలో ఉంది. నన్నయ్యకు శిష్యు లెవరున్నారో మనకు తెలియదు. తిక్కన్నకు మారన్న ఉన్నాడు. ఆయనవల్ల తిక్కన్నకు గౌరవం వచ్చిందంటే అందరూ అంగీకరింపరు గాని గురువుకు తగ్గశిష్యు డని మాత్రం ఆయన్ను ఆదరిస్తారు. మరి ఆఅంశంలో వేంకటశాస్త్రిగారు అదృష్ట వంతులే. అది అందరూ ఒప్పుకొనే సత్యం.

అయితే విశ్వనాథవారు తననుగురించి అంతవిశేషణాన్ని వేసుకోవటం లోని ఔచిత్యాన్నిగురించి వాదోపవాదా లున్నాయి. ఔచిత్యం ప్రతిపాద్య విషయాన్ని ప్రతిపాదించే విధంలో ఉంటుంది. ఒకవాక్యంలో ప్రధానాంశం (Principal clause) కొద్దిమాటల్లో ఉండి ఉపాంగం (Subordinate clause) దీర్ఘంగా ఉండనుకోండి. ఉపాంగం ఎప్పుడూ ప్రధానాంగానికి గౌణమే. అయినా అది ప్రధానాంశప్రశస్తికి పతాకగా నిలుస్తుంది. ఇది లోకవ్యవహారంలో ఉన్నదే. రాముడల్పుడైతే గురువైన వసిష్ఠునికిగాని, విశ్వామిత్రునికిగాని ఏమి గౌరవం? రావణుడల్పుడైతే తద్విజేత అయిన రామునికేమి గౌరవం? తిక్కనగారు వ్రాసిన నిర్వచనోత్తర రామాయణంలో విస్తృతంగా వర్ణింపబడ్డ రావణపరాక్రమం చివరకు రామార్పితం కావటంలేదా? ధ్వనిమార్గంలో అది ఒకసూక్ష్మరహస్యం. పైపద్యం ఆవ్యంగ్యగౌరవంతో సాహిత్యగౌరవాన్ని సంపాదించుకొన్నది. 'అలఘుస్వామరసావతారధిషణాహంకారసంభారదోహల బ్రాహ్మీమయమూర్తి' శిష్యుం డయినాం డనడం లోనే వేంకటశాస్త్రిగారిగురు మూర్తి హిమవన్నగశృంగంలా నిలిచి ధవళకీర్తిచంద్రికలను ప్రసరింపగలిగింది.

అంతసమాసం అహంకారానికి చిహ్న మంటారా? అధికారికి అహంకారం అలంకారమే. నిజం చెప్పితే నిష్ఠురం అంటే చెప్పలేం కాని - తెలుగువారికి వెంకటేశ్వరుం డెంత మహనీయుడో విశ్వనాథు డంత మహితాత్ముండు. ఈ అద్వైతసిద్ధి ఉన్న బుద్ధిమంతులకు ఈపద్యంలోని రససిద్ధి కౌచిత్యవిచారచర్చ అడ్డం రాదు.

చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు శిష్యులపై అమృతవర్షాన్ని కురిపించేవారు, శత్రుపర్వతాలపై పిడుగులవింతు పరిపించేవారు. వారి వ్యక్తిత్వాన్ని సూక్తి మరందంతో వ్యాఖ్యానించారు విశ్వనాథ సత్యనారాయణగారు.

> "తన యెద యెల్ల మెత్తన కృతప్రతిపద్యము నంతకంటె మె
> త్తన తనశిష్యు లన్న నెడదం గల ప్రేముడి చెప్పలేని మె
> త్తన యయి శత్రుపర్వతశతారము సత్కవి చెళ్లపిళ్ల వేం
> కన గురు వంచుం జెప్పికొనంగా నది గొప్ప తెలుంగునాండునన్".

శాస్త్రిగారు శత్రువులపట్ల చూపించే పారుష్యానికి ఉపమానం ఉంది కాని, శిష్యుల పట్ల చూపించే వాత్సల్యానికి సాటి లేదు పైపద్యంలో. 'చెప్పలేని మెత్తన' అన్ని

చెప్పి ఊరుకోవటం శిల్పం. భావుకునికి చెప్పలేనంత ఆలోచనామృతాన్ని అందించే తెలుగుపలుకుబడి. గురుకృపను కూలంకషంగా చవిచూచి, మనకు చవిచూపిన చతురుడు విశ్వనాథ.

> "పుడమిని బెక్కుసత్కవులు పుట్టిరి; ముట్టిరి సత్కవిత్వపుం
> దొడిమలు; చెళ్లపిళ్లకవితోఁ దులతూగెడువారె ? వానలోఁ
> దడియనివారు మద్గురువధానమృదూక్తిమరంద ధారలోఁ
> గడుఁగనివారు మా కెచటఁ గానఁగరా రిలఁ దెల్గునాఁడునన్"

విశ్వనాథవారి గురుప్రశస్తికి పతాకవంటి దీపద్యము సత్కవు లెందరో కవిత లల్లినారు కాని, వా రాకవితాప్రసూనంలోని తొడిమను మాత్రమే తాకగల్గినారట! వేంకటశాస్త్రిగారు కవితామరందాన్ని సేవించి అవధానకవితామాధుర్యాన్ని వర్షించారట! వానలో తడియనివాడూ, వారిమరందధారలో మునుగనివాడూ తెలుగుదేశంలో లేడట. తెలుగునాడులో తిరుపతివేంకటకవుల అవధానకవిత్వం సమ్మోహనమంత్రంలా పనిచేసింది. వారిఅవధానాన్ని చూచిన ప్రతియువకుడూ ఆవేశంతో కలాన్నిపట్టాడు. జంటకవిత్వం చెప్పాలని ఉబలాటపడ్డాడు. విశ్వనాథవారూ ఆప్రభావానికి లోగినవారే. జంటకవిత్వాన్ని సాగించినవారే. కొడాలి ఆంజనేయులు వారి జంటకవి. ఆయనతో కలిసి చేసిన కవితావ్యవసాయం కలకాలం సాగకపోయినా కమనీయ స్మృతుల్నిమాత్రం విశ్వనాథకు మిగిల్చిపోయింది.

> 'తన మృదుజిహ్వపై రవలు దాల్చిన నూఁగునిగారపుం జిగుల్
> చను కవితాసతిన్ విడచి సాధుమహాహవశీలుఁ డౌ మహా
> త్ముని యనిలేనిసేనఁబడి పోయెడువానిఁ గొడాలి యాంజనే
> యుని మును నాకు జంటకవియున్ బ్రియమిత్రము సంస్మరించుచున్"...
> 'అతఁడె తోడు కల్గినను నచ్చముగాఁ గలకండ లచ్చులుం
> బోఁతలు పోసి యుండెదము పోతనగారి విధాన;'

నని కల్పవృక్షంలో కరుణార్ద్రంగా చెప్పుకున్నారు విశ్వనాథ. ఆయనకు మిత్రు డన్నా, శిష్యు డన్నా 'ఎదదం గల ప్రేముడి చెప్పలేని మెత్తన.' విశ్వనాథ కవిగా ఎంత గొప్పవాఁడో మనసున్నమనీషిగా అంత మహోన్నతుఁడు

ఆధునికాంధ్రసాహిత్యజగత్తులో విశ్వనాథ ఒకవిరాణ్మూర్తి వచన కవిత్వాన్ని వినా ప్రాచీనాధునికాంధ్రప్రక్రియల్లో ఆయన చేపట్టని ప్రక్రియ లేదు; పట్టింది బంగారం చేయని పట్టు లేదు. గేయం వ్రాసినా పద్యం రచించినా, ముక్తకం వ్రాసినా మహాకావ్యాన్ని రచించినా విశ్వనాథకృతిలో ఆయనదైన ఒకవ్యక్తిత్వం ప్రతిబింబిస్తుంది. వాక్కులో, వాక్యంలో, శబ్దంలో, సమాసంలో, భావంలో, భావనంలో, దర్శనంలో, విమర్శనంలో, భాషణంలో, భూషణంలో ఒకవైలక్ష్యం వెల్లివిరుస్తుంది. మహాకవిగా మనుగడ సాగించటానికి ఉండ వలసిన మొదటిలక్షణం ఈ వ్యక్తిత్వం,

> 'గోదావరీపావనోదారవాఃపూర
> మఖిలభారతము మా దన్ననాఁడు
> తుంగభద్రాసముత్తుంగరావముతోడ
> కవుఁగానము శ్రుతిఁ గలయునాఁడు
> పెన్నానదీసముత్పన్నకైరవదళ
> శ్రేణిలో తెన్గు వాసించునాఁడు
> కృష్ణాతరంగనిర్ణిద్రగానముతోడ
> శిల్పమ్ము తొలిపూజ సేయునాఁడు
>
> అక్షరజ్ఞాన మెఱుఁగదో యాంధ్రజాతి?
> విమలకృష్ణానదీ సైకతములయందు
> కోకిలపుఁబాట పిచ్చుకగూండ్లు కట్టి
> నేర్చుకొన్నది పూర్ణిమానిశలయందు'.

విశ్వనాథవారిశైలి ఒడ్డులొరసి ప్రవహించే తెలుగుజీవనదిలాంటిది. గోదావరీ ప్రవాహగాంభీర్యాన్ని సంతరించుకొన్న వారివాక్పాకం శ్రీనాథకవిసార్వభౌముని కవితారీతివలె ప్రౌఢిమను పుక్కిలిస్తుంది. సామాన్యంగా విమర్శకులు సంస్కృత సమాసబంధురమైన రచనంలోనే ప్రౌఢిమ ఉంటుందని భావిస్తారు. అది సమం జసం కాదు ప్రౌఢి కవియొక్క ఉక్తి నాశ్రయించి కావ్యజీవితాన్ని సారవంతం చేస్తుంది. కవిప్రౌఢోక్తి శబ్దాన్నీ అర్థాన్నీ ఆశ్రయించి ఉంటుంది. అది వస్తు వునూ, అలంకారాన్నీ, రసాన్నీ వ్యంగ్యసుందరం చేస్తుంది. ధ్వనిమర్మజ్ఞులైన విశ్వనాథవారి ప్రౌఢోక్తి రసజగత్తును వ్యంజింపజేసి సార్థకమౌతుంది. ఆయన రసయోగి సర్వశబ్దప్రపంచాన్నీ రసోన్ముఖంగా నడిపించటంలో అందెవేసినచేయి.

'కవిప్రతిభలోన నుండును గావ్యగతశ
తాంశములయందుఁ దొంబదియైనపాళ్లు
ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవకథాదృతిని మించి'

అని ఆయనదృక్పథము. రసాభివ్యక్తిని కల్గించే శబ్దం ఆంతరమైన భావప్రపం చానికి బాహిరమైన ప్రతీక. చిత్తావస్థ కుచితంగా శబ్దరచనను తీర్చిదిద్దటం శిల్పం. అందులోనుండే సమాసాలూ, నుడికారాలూ, జాతీయాలూ, వాక్యవిన్యాసాలూ చిత్రవిచిత్రంగా లాస్యంచేస్తూ ముందుకు వస్తాయి. వానివిన్యాసంలో, ఆవిష్కరణంలో కవిప్రౌఢి కదనుత్రొక్కుతుంది. ఆప్రౌఢగతిలోనే విశ్వనాథ వ్యక్తిత్వం ప్రత్యక్షమౌతుంది.

పైసీసపద్యంలో ఆంధ్రప్రశస్తి వస్తువు. దానిని తెలుఁగునదుల నాలంబనంగాచేసి విశ్వనాథ వ్యక్తీకరించారు. నదీవైభవాన్ని అవిచ్ఛిన్నధారామధురంగా ఆవిష్కరించటం, కళావైభవాన్ని తెలుగుపలుకుల జిలుగుశిల్పంతో వ్యంజింపఁ జేయటం పద్యరచనంలోని శిల్పం. శ్రీనాథు డన్నట్లు 'ప్రౌఢి పరికింప సంస్కృత భాష యండ్రు', 'పలుకునుడికారమున నాంధ్రభాష యండ్రు'. అయినా ఆయనది కర్ణాటభాష. ఆభాష యేమి టన్న ప్రశ్న అలా ఉంచితే- అది ఒకవిలక్షణమైన వాక్పాకం అన్నది సత్యం. అలాగే విశ్వనాథవారిదీ విలక్షణమైన కవితామార్గం. రసవ్యంజకత్వమే దాని లక్ష్యం. ఆంధ్రజాతివైభవ మంటే అణువణువునా పులకిస్తాడు విశ్వనాథ. ప్రాచీనాంధ్రపౌరుషమంతా తనరక్తనాడుల్లో ప్రవహిస్తున్నట్లు పరవశిస్తా డాయన.

'ఇమ్మగఁ గాకుళమ్ము మొద లీవరకుం గల యాంధ్రపూర్వరా
జ్యమ్ముల పేరు చెప్పిన, హృదంతర మేలొ చలించిపోవు, నా
ర్ద్రమ్మగు చిత్తవృత్తుల పురాభవనిర్ణయ మేని ఎన్నిజ
న్మమ్ములు గాగ నీతనువునన్ ప్రవహించునొ యాంధ్రరక్తముల్'

'ఇది వినిపింతు నంచు మది నెంచెద మిత్రులకున్ గళస్థగా
ద్గదికము, లోచనాంతబహుధాస్రుతబాష్పనదమ్ము, స్పందనా
స్పదహృదయమ్ము, నాపనికిఁ జాలక చేసెడు, నన్ను నింతగా
నెద పదిలించుకొన్న దిది యెక్కడి పూర్వపుజన్మవాసనో !'

వేంగీక్షేత్రాన్ని కీర్తించే సందర్భంలో వ్రాసిన పీపద్యాలు. వాస్తవజగత్తులోనుంచి వాసనామయమైన ఆంతరజగత్తులోకి ఆలోచనను అంతర్భవింపజేస్తున్న పీపద్యాలు. అంతశ్చేతనమే అక్షరాకృతి తాల్చటం ఈపద్యరచనాశిల్పం. అచ్చమైన అనుభూతికి మచ్చలేని మణిదర్పణా లీపద్యాలు. 'రమ్యాణి వీక్ష్య మధురాంశ్చ నిశమ్య శబ్దాన్' అన్న కాళిదాసుశ్లోకంలోని రసదృష్టి ఈపద్యాల్లో కనిపిస్తుంది. అపూర్వభావనాబంధురమైన రచనంతో ఆలోచనామృతాన్ని వర్షించటం కంటె సున్నితమైన హృదయస్పందనాన్ని కలిగించి తన్మయత్వం కల్గించటం కష్టం. రసార్ద్రచిత్తునికిగాని ఇట్టిరచనం సాధ్యం కాదు!

తెలుగుదేశాన్నీ, ఋతువుల్నీ, నదుల్నీ, తెలుగుప్రకృతినీ తమిమీర వర్ణించారు విశ్వనాథ. జాతీయకవులలో జాతిరత్నం విశ్వనాథ.

'మాపూర్వాంధ్రధరాధినాయకకథామంజూషికారత్నగా
థాపద్యావళి పేరి హారిసుమనోదామంబు మాధ్వీకభా
షాపృక్తంబు మహాప్రబంధరచనాసౌందర్యపుఁ వాసనల్
తీపై క్రమ్మఁగ నాంధ్రసోదరుల కందిత్తున్ గళాంకమ్ముగన్'

అని ఆంధ్రప్రశస్తిని ప్రబోధకవితాశాఖకు ప్రఫుల్లకుసుమపరాగంగా తీర్చిదిద్దారు. ఆంధ్రవిష్ణువు, శాతవాహనుఁడు, గోతమీపుత్రశాతకర్ణి, మాధవవర్మ, ప్రోలరాజు మొదలైన తెలుఁగుతేడులు; వేంగీక్షేత్రము, ముఖలింగము మొదలైన తెలుఁగునాడులు; నన్నయభట్టాదులైన ఆంధ్రకవులు; ఆంధ్రప్రశస్తిలో అమరగానానికి పాత్రులైనారు. కాళిదాసులా విశ్వనాథవారు ఋతుసంహారాన్ని రచించినా ఇందులో వర్ణింపబడ్డవి తెలుగుఋతువుల వింతసోయగాలు.

గ్రీష్మకాలంలో విజయవాడప్రాంతంలో ప్రతియేటా పూరిపాకలు పరశురామ ప్రీతికావటం పరిపాటిగా వినవచ్చేవార్త. ఆ వాతావరణం ఈసీసపద్యంలో వెలుగునిస్తుంది.

'దణ్ణెమ్ముపైని వస్త్రము కొంగు జారి క్రిందను నంటుకొన్నది దాలిసెగకు;
దొడ్డిలోఁ బొయ్యార్పి, తొలఁగ, నెక్కడో రవ్వమిగిలి పెన్గాలికి రగిలి యెగిరె
దూలమ్మునకుఁ దాట వ్రేలనైన పటుపు గట్టునులక దివ్వె ముట్టుకొనియె
చిదుకులమంట బోసిన దృష్టి తీసి, మిర్కులఁ బ్రేలి చూరెక్కె మిరపకాడెను

పురము, పేట, పల్లె పరశురామప్రీతి కాదిహేతువులుగ నాడుకొనిరి
నిందలేకయుండఁ బొందె పో దనట్లు యమునివోని గ్రీష్మ నరయలేక'.

తెలుఁగుపల్లెల జీవనాన్నే కాదు తెలుగుపంటలవైభవాన్నికూడా విశ్వనాథ ఋతు ధర్మవిశేషాల్లో విశ్లేషించి వర్ణించారు. మచ్చుకు శరదృతువర్ణనంలోని ఒక పద్యం.

'పొద్దుటింతల వాయువులు తావికై మెల్ల కొతిమేరచేలపైఁ గొసరులాడె
చిఱుచేఁదు వలచెఁ గోసిన జొన్నచేనిలోఁ దొడిమదగ్గర పచ్చిదోసపండు
పండి కోయనిమిరపలు పెండ్లికూతుండ్ర వలె సకుంకుమశోభఁ గులుకులాడె
వడిసెలఱా, తప్పనొడుపు నేర్పను దల్లి చిన్నిపిట్టకు మొక్కజొన్నచేలఁ
జెలఁగె దలగిల్లిన పొగాకు సెనగతంపటలును బంతిపూల్ మిరపతోటలకుమధ్య
శరదృతుసమస్తము బ్రహ్మదర్శనము చేసెఁ గూడి మెట్టపొలాల వికుంఠలక్ష్మి.'

హేమంతర్తువులో మంచుబిందువులు ఉత్ప్రేక్షాలంకార భూషితాలై ఉజ్జ్వల తారకల్లా విశ్వనాథకవితలో వెలుగొంది నిలిచినాయి.

'తట్టలోఁ గూర్చుండఁ బెట్టిన వధువునా గుమ్మడిపూవులోఁ గులికె నొకటి;
ఖండితాపాంగసక్తనవాంబుకణము నాఘూసాగ్రమునయందుఁ గదలె నొకటి;
తులసిమ్రుగ్గున నిడ్డ తొలుకారు దివ్వెనా సాలీనిపటముపై సాగె నొకటి
ఘూర్జరీముఖలంబికొసముత్తియంబునా నాఁదూడ నొసటిపై నాటె నొకటి
మధువునాఁ బూవుఁబూవున మసలె నొకటి జగ్గునా నాకునాకున జాఱె నొకటి
మంచుబిందులు నవసుకుమారమూర్తి మంతములు ప్రాతరంత హేమంతవేళ'.

ఉపమానాల నెన్నుకోవటంలో విశ్వనాథవారి ఔచిత్యదృష్టితోపాటు, అపార లోకవ్యుత్పత్తి వ్యక్తమౌతున్నది. వ్యుత్పత్తి భిత్తివంటిది. ప్రతిభ చిత్రలేఖనం వంటిది. పరిపుష్టమైనభిత్తి లేనిదే చిత్రం కలకాలం నిలవదు.

ఋతువర్ణనాల్లో శరత్కాలమూర్తిసాక్షాత్కారం విశ్వనాథ భావుకత కబ్బిన శరచ్చంద్రికాధవళకీర్తి.

'ఱెక్కలు చాఁచి తీరికగాఁగ గాలిలోఁ దేలిపోయెడు నంచవోలె వచ్చి
సితవస్త్రకృతగరున్మతి నృత్తసమభంగ తురికీల నర్తకిసరణి వచ్చి
ఇరుదెసల్ కాంతిచే నొరయ సూర్యున కెదురౌ సితాంబుజలక్ష్మి యట్లు వచ్చి
నిమ్నోన్నతములు లేని కులాంగనాచ్ఛ కూలంకషప్రేమకల్పముగ వచ్చి

చందిరునివోలె నవనీరజాతబంధు కిరణసంస్పర్శచేత వెల్గించుకొంచుఁ
దన తనూసృష్టిసర్వ మందముగ వచ్చెఁ దల్లి కృష్ణాతటిని శరత్కాలమూర్తి.'

కాలచక్రం చేతనాచేతనమైన ప్రకృతిని ప్రభావితం చేసే ప్రవృత్తిని సూక్ష్మేక్షికతో పరిశీలించి ప్రపంచించేతత్త్వం ఋతుకీర్తనంలో కనపడుతుంది. ప్రకృతి పరిణామానికి మానవప్రకృతి ప్రతిస్పందించే ప్రక్రియను ప్రత్యంశప్రౌఢంగా చిత్రించిన ప్రాచీనుల్లో రాయలూ, అధునికుల్లో విశ్వనాథవారూ అగ్రగణ్యులు.

విశ్వనాథవారిగేయకావ్యాల్లో ప్రశస్తి గాంచింది 'కిన్నెరసానిపాటలు'. భద్రాద్రిరాముని త్రోవను కాచి గోదావరీనదీమతల్లి యొడిలో నిలిచిన కిన్నెరసాని వాగు విశ్వనాథవారి కల్పనలో ఉద్విగ్నయైన తెలుగుపడుచులా రూపొందింది. అత్త పెట్టే ఆరళ్లకూ, కట్టుకున్నవాని మెత్తనితనానికీ మధ్య నలిగిపోయిన ఆపడుచుపిల్ల కంటికి కడవకట్టటమే కాకుండా, పతికౌగిలిలో వాగుగా కరిగి జాలువారింది. ప్రణయమూర్తి ప్రవాహమైన ప్రళయాన్నిచూచి కిన్నెరసాని భర్త కుమిలికుమిలి శోకించి కరడుకట్టి శిలయై పోయాడు.

'ఈవు రసాకృతి వగుటను - ఈవైఖరి ప్రవహించితి
నేను శిలాహృదయుండను - పూనుదునే ధునీవైఖరి'

అని వాపోయినాడు. భర్తలో ఘనీభవించిన కరుణం, భార్యలో పరవళ్లుత్రొక్కిన కరుణం ఆకృతికల్పనకు ఆలంబనంగా గ్రహించారు విశ్వనాథవారు.

నదీమతల్లిని నారీమణితో పోల్చటం కవిసమయం. వాగునే మగువగా రూపించటం ఇందులోని శిల్పం.

'బ్రతికి ఉన్నప్పుడూ - అతివ కిన్నెరసాని
యెంత ఒయ్యారియో యెంత నెమ్మదిదానొ
అంత ఒయ్యారమ్ము అడుగడుగు పోయింది
అంత యిల్లాలినెమ్మదితనము చూపింది'.

కిన్నెరనడకలూ, నృత్యమూ, సంగీతమూ, దుఃఖమూ, ప్రవాహపరంగా సాగినా కిన్నెరసాని జలదేవతగా అంతరంగానికి రూపుకడుతుంది. ఆనదీసుందరి ప్రతి కదలికా విశ్వనాథవారి గేయచ్ఛందంలో హృదయస్పందంగా నినదిస్తుంది.

'కదలగా కదలగా - కాంత కిన్నెరసాని
పదపుకట్టిన లేళ్లకదుపులా తోచింది
కదలు తెల్లని పూలనదివోలె కదిలింది
వదలు తెల్లని త్రాచుపడగలా విరిసింది'.

'జలజలా పొంగింది - బిలబిలా నడచింది
పరికిణీ తొక్కాడు పదియేళ్లకన్నెలా
చిన్నిగంతులు వేయు తెల్లనాబెయ్యలా
పసిపాప సెలవివారిన బోసినవ్వులా'

'జలదేవతలవెంట సాగి కిన్నెరసాని
తెలితారకలవెంట వెలుగులా తోచింది
తలిరుపూవులవెంట తావిలా తోచింది
తెనుగుపాటలవెంట తీపిలా తోచింది'.

విశ్వనాథవారి ఉపమానాలు వర్ణ్యవస్తువుయొక్క ఉన్నరూపాన్ని చెప్పటంతో ఆగక ఊహాప్రపంచాలకు క్రమంగా తీసికొనిపోతవి. మాలోపమలలో విశ్వనాథ మలచిన శిల్పం అది.

ఆవేశంలో నీటిజాలుగా మారి, కొండకోనల్లో జారి, అడవులబడి పరువెత్తినా కిన్నెరసాని మహాపతివ్రత. కిన్నెర తళుకుబెళుకుల్ని చూచి సాగరుడు మోహపడ్డాడు; ఆమెను కౌగిట్లో చేర్చాలని ఉవ్వెత్తుకెరటాలతో ఉప్పొంగి పోయాడు; కులమర్యాదను కాలదన్ని కులకాంతలను చెరపట్టే సామంతుడిలా కామాంధ్యాన్ని ప్రదర్శించాడు. కడలిరాజు నిజరూపం తెలుసుకొన్న పడతి కిన్నెరసాని పరిపరివిధాల పరితపించింది.

'తన కున్న మరియాద యెంతా - తనకున్న గౌరవం బెంతా
లోకాలు తప్పత్రోవల పోవునా యేని
సర్ది చెప్పగలట్టి సామంతు డీ రాజు
తానుగా దిగెనా - తప్పుదారులకూ'

'ఓనాథ నిను వీడి వచ్చి - ఓరాజ నిను వీడి వచ్చి
నాయెడ ల్సయితమ్ము నానాజనులు కోర
యీయేవపుంబ్రదు కేల పొందితినిరా
అంచు పగచినదీ - అంచు లురలినదీ.'

పతి నెడబాసిన పడతి సంఘంలో పడే అగచాట్లు వ్యంగ్యంగా ఈయితివృత్తంలో సూచింపబడినవి. గోదావరీమాతవంటి గుణవతులు గోముఖవ్యాఘ్రాలైన కామాంధులనుండి కన్నెపడుచుల్ని కాపాడి కడుపులోపెట్టుకొని రక్షిస్తారన్న సత్యాన్ని కిన్నెరసాని వాగు గోదావరిలో సంగమించేఘట్టంలో కవి ధ్వనింపచేశాడు. నదీ వైభవాన్ని వస్తువుగా తీసికొన్న ఆధునికకృతులు చాలకొద్దిగా మాత్రమే ఉన్నాయి. ఆధునిక సాహిత్యంలో వాటికి 'కిన్నెరసాని' కున్న కీర్తి లేదు. అది తెలుగుదనం తెట్టకట్టిన తేనెవాక, తెలుగుపాట రక్తికట్టిన దేశివృత్తం. విశ్వనాథ కిన్నెరసానిపాటలు పాడితే తెలుగుదేశం పరవశించిపోయింది. ఇప్పటికీ, ఇంకెప్పటికీ ఆబాలగోపాలాన్ని అలరించే మధురకవిత ఈ కావ్యం.

విశ్వనాథవారు భావకవిత్వయుగంలో ప్రణయగీతా లాలపించారు. అద్వైతప్రేమ వారి ఆరాధ్యతత్త్వం. ఆప్రేమకు ప్రతీకయైన స్త్రీ అనురాగానికీ ఆరాధనకూ ఆలంబనం. అనంతవిశ్వాకృతిగా వ్యాపించిన ప్రకృతి ఆప్రణయమూర్తికి ప్రతిరూపం. ఆ అనంతమూర్తిని హృదయాంతరంలో నిలుపుకొన్న ఆరాధకుఁడు కవి.

> 'నీ నిజస్వరూపమ్ము ధ్యానింప నెంచి
> విశ్వవస్త్వంతరమ్ముల వెదకి వెదకి
> కొసకు నా హృదయాంతరకోటరస్థ
> మైన సూక్ష్మాకృతిని నిన్ను నే నెఱిఁగితి.
>
> నేను ప్రాపంచికముగ ననేకకార్య
> లగ్నహృదయుండఁబోలె నెల్లరకుఁ గానఁ
> బడుదునే కాని దేవి ! నాభావ మెపుడు
> నిత్యలగ్నంబు నీపాదనీరజముల.'

ఆదేవి ప్రణయార్థంలో భావసుందరి కావచ్చు, పరమార్థంలో పరదేవత కావచ్చు. మధురభావనంలో మార్మికత విశ్వనాథవారి భావగీతికాఖండాల్లోని ఒక ప్రత్యేకత.

విశ్వనాథవారి భావగీతాల్లోనూ, శతకాల్లోనూ ఆత్మనాయకమైన భావస్రవంతి అంతర్లయగా ప్రవహిస్తుంది. ఆయన ప్రణయజీవితంలో పాలుపంచుకొన్న అర్ధాంగి (మొదటిభార్య) అమరత్వాన్ని పొందినప్పు డాయనసంస్కారవంతమైన అంతరాత్మ ఆప్రేమమూర్తిని అమరజ్యోతిగా ఆరాధించింది.

వైయక్తికమైన కవికరుణం విశ్వజనీన మౌతుంది కవిత్వంలో (వరలక్ష్మీ త్రిశతి).

'నీవు వేలుపుటూరి వేవెల్గురేకవు కేవలమును మృదాకృతిని నేను
నీవు సదాచారనిష్ఠాయతాత్మవు కడుదురాచారనిష్ఠుఁడను నేను
నీవు నిశ్చలమనోభావాభిరామవు సరి చంచలాతిచంచలుఁడ నేను
నీవు స్త్రీరూపమందిన గేహధర్మమ వొకరీతి కొదుగని యులిపి నేను

ప్రకృతి వచ్చముగా నీవు; వికృతి నేను నాపౌనర్భ మహాఘసంతతుల నడుమ
నే సుకృతలేశఫలమొ నాయిల్లు నీవు లీలగాఁ గొన్నినాళ్లు వెల్గించినావు'.

భౌతికవిభావం భావనామయ మైనప్పుడు సాధారణీకరణం చెంది సహృదయ చిత్తద్రుతిని కలిగిస్తుంది. వస్తువు ఆత్మాశ్రయమైనా అనుభూతి రసాశ్రయం.

విప్రలంభశృంగారానికి కాళిదాసు మేఘదూత ప్రసిద్ధి. ఆధునికాంధ్ర కృతుల్లో విశ్వనాథవారి 'శశిదూతము' అటువంటిది. ప్రణయకుపితులైన నాయికానాయకులు ఏకశయ్యాగతులైకూడా పరాఙ్ముఖు లౌతారు. నాయకుఁడు శశిదౌత్యాన్ని అర్థిస్తాడు.

'అమృతముకూడుకట్టినదొరా ! యల దూరపు నీలికొండలో
గొమరుమిగుల్ సితాంబుదముకోసల మూసలు పోతు వెన్నెలల్
రమణి యొకింత కోపన పరాఙ్ముఖ యైనది, నాకుఁ జెప్పఁకో
నమరినదూత యిప్పు డెవరందువు నీవు వినా నిశాపతీ !'

తనప్రయోజనాన్ని సాధించుకోవడానికి పరోపకారపరాయణత్వాన్ని ప్రబోధిస్తాడు.

'తొలుతను నాదుప్రేయసి మృదుప్రణయాగ్రహ మొత్తిగిల్లఁ గా
సలిపెదవేని నీకలువచానయు నీవును గూడి తెల్లవా
రలు సుఖియింపవచ్చు నవురా ! పరులన్ సుఖియింపఁజేసి న
ట్టులు నగుఁగాక నీవ యొకఁడున్ సుఖియించిన నేమి గొప్పయో ?'

దౌత్యాన్ని నిర్వహిస్తే ఉపాయనాన్ని అందిస్తానని ఆశ కల్పిస్తాడు.

'తేర్చితివేనిఁ జిర్నగవు తీర్చిన పల్వరుసన్ మెఱుంగులున్
మార్చినవేడుకన్ రతిఁ జెమర్చిన చల్వలు నూర్పుతావులున్
కూర్చినప్రేమ నీకు నొదఁగూర్తుము కాన్కలు దంపతిప్రజా
ఖ్యర్చితమూర్తివై తిరుగుమా ! చిఱువెన్నెలఁ బంచిపెట్టుచున్'.

వెలుగఁతేనిని ప్రసన్నుణ్ణి చేసుకోవటానికి స్తోత్రం ప్రారంభిస్తాడు.

'కప్పురపుఁబల్కులట్లు కలకండపొడింబలె సన్నసన్నగా
లిపొరలసందుసందులఁ జలించి వెసన్ మణిమూక్క త్రుంచిన
ట్లు పొదలి బైటికిన్ మెఱసి లోపలలోపల చల్లచల్లనై
కృపగల నీదు రేవెలుగురేకలు మాకుఁ బ్రసన్న మయ్యెడున్'.

ఉదంకుని నాగస్తవంలా సాగిన కవికుమారుని ప్రార్థనం ఫలిస్తుంది. పరాఙ్ముఖ యైన నాయిక సౌముఖ్యాన్ని ప్రసాదిస్తుంది. స్వార్థం తీరింది కదా అని నాయకుడు పరార్థాన్ని మర్చిపోడు.

'నీదయ నాకు నొక్కనికినే యిపుడే దయచేసినంతటం
గా దెపుడే దయాశిశిరకాంతులఁ జూడవలెన్, మఱెవ్వఁడే
నీ దయితానవప్రణయనిర్భర కోపపుబాళిఁ గుందుచో
నాదు కొనంగనున్ వలెనయా! చలివెన్నెలసోనజల్లుతో'.

సర్వలోకమంగళాకాంక్షి యైన నాయకుని ఉదాత్తాశయం కావ్యవిశ్వజనీనత్వాన్ని వేనోళ్ల చాటుతుంది. శశిదూతం విశిష్టమైన దూతకావ్యం. తెలుగుదనం పండు వెన్నెలలా విరిసిన వినూత్నప్రయోగం. విప్రలంభశృంగారప్రయోగశిల్పంలో సరిక్రొత్త కల్పన. వెన్నెలవైభవానికి కవితావ్యాఖ్య.

భక్తుడు భగవంతునికి ఆత్మవేదనాన్ని నివేదించుకుంటున్నట్లుంటుంది విశ్వనాథ శతకకవిత్వం. ఆ వేదనలో అవస్థలు అనంతాలు.

'స్వాంతంబున్ మృదుశయ్యపైఁ బఱచితిన్ భక్తిప్రథావస్త్ర మ
త్యంతంబున్ బయిఁ జల్లితిన్ మృదులభావాఖ్యప్రసూనాళి నా
యంతర్గేహము బాగు చేసితిని నీకై కంటిదారిన్ బ్రతీ
క్షింతున్ వాసకసజ్జికన్ బలె సుమాచిత్తేశ! విశ్వేశ్వరా!'

ఇందులో కవి నాయిక; అవస్థ వాసకసజ్జికాభావము. విశ్వేశ్వరుఁడు నాయకుఁడు. మధురభక్తి కిది మచ్చుతునక.

'నీవే రాజువు నేను సక్కవిని తండ్రీ! నిన్ను వర్ణించెదన్
నీవే దైవము నేను భక్తుడను దండ్రీ! నిన్ను ధ్యానించెదన్
నీవే భూమివి నేను గర్షకుడఁ దండ్రీ! నిన్ను ఖండించెదన్
నావైదగ్ధ్యము నీవ చూతు, కృప సంధానింపు విశ్వేశ్వరా!

కవిత్వాన్ని ఆరాధనావిశేషంగా మలచుకొన్న విశ్వనాథచిత్తపాకం ఇందులో ధ్వనిస్తోంది. కవిత్వమే ఆయనకూ ఆభగవంతునికీ అక్షరసంబంధం.

'ఒక్క కవిత్వమ్ము తీసివేసిన నోస్వామి! నాదు
చిక్కిరిబిక్కిరి గాగ నైనట్టి జీవితం బేమి
యెక్కడ బాతాళమంతలోతు, దా నిది యన్న మెరక
యెక్కడ, వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి!'

'నిను నూహ చేసెడు నంతసేపును నే నొక్క బుద్ధి
ఖనిని నీయూహ మానితిని నేను మూర్ఖవతంసు డైతి
నను దాకుచుంటివి పరుసవేదివి నవ్యచైతన్య
ఘృణిఖనీ! వేములవాడ రాజరాజేశ్వరా! స్వామి!'

మత్తేభాలైనా, మధ్యాక్కరలైనా మనసును విప్పిచెప్పే మనోజ్ఞసాధనంగా ఈ మహాకవి మలచుకొంటాడు. మనోగతి కనుగుణంగా వృత్తగతిని సాగించుకుంటాడు. పరమేశ్వరుణ్ణి మంకుపట్టుపట్టి, మెడలువంచి వరాన్ని సంపాదించే యుక్తి విశ్వనాథ భక్తి.

'సరి యేదో సామెత చెప్పుదురు సుమీ శని పట్టెనేని
పరగంగ నేడేండ్లు తాను పట్టినఁ బదునాలుగేండ్లు
పరమేశ! నను స్వీకరించి యీపీడ వదలించుకొమ్ము
హరహరా! నందమూర్నిలయ! విశ్వేశ్వరా! కులస్వామి!'

ఉపాలంభనంలో కూడా ఉద్విగ్నత ఉంటుంది విశ్వనాథ కవితలో. జీవుడుగా తాను ఆర్తితో ఆనందరూపుడైన అంతర్వర్తికి మొఱపెట్టుకుంటాడు. మారు పల్కకపోతే మహాకావ్యమంత మహజరు పెట్టుకుంటా నంటాడు.

'నిన్నార్తిచేత నిట్లడుగుచుంటిఁ గాని లేక యున్న
వన్నెలు చిన్నెలుగాగ వర్ణింప వలఁతిని నేను
నన్నెఱుంగుదు గాదె మరల రామాయణమ్మంత చేతు
నిన్నుఁ గష్టముకాదు భద్రగిరి పుణ్యనిలయ శ్రీరామ!'

అన్నంతపనీ చేశారు విశ్వనాథవారు. మరల రామాయణాన్ని కల్ప వృక్షంగా తెలుసాహిత్యోద్యానంలో ప్రతిష్ఠించారు. వాల్మీకి రచించిన రామాయణం గీర్వాణవాఙ్మయంలో ఆదికావ్యం. భారతీయ సంస్కృతికి మణిదర్పణం. సంస్కృత సాహిత్యంలోనే ఆ కావ్యేతివృత్తం వివిధ సాహిత్యప్రక్రియల్లో వినూత్నకల్పనా విశేషాలతో విరాడ్రూపం తాల్చింది. రామాయణం కావ్యంగానే కాదు, తాత్త్వికదర్శనంగా, మహామంత్రంగా ఆధ్యాత్మికౌన్నత్యాన్ని సంతరించు కొన్నది. దేశభాషాసాహిత్యాల్లో అది పండించని పంట లేదు. తెలుగులో కూడా ఎన్నో రామాయణాలు వచ్చాయి. సర్వపూర్వరామకథా తత్త్వసర్వస్వపేటికగా రామాయణం తెలుగున వ్రాయాలని విశ్వనాథవారు సంకల్పించారు. అది మహాకవులకు మహాకావ్యం, తాత్త్వికులకు వేదాంతసారం, లాక్షణికులకు సర్వకావ్యలక్షణసారం, లౌకికులకు లోకవృత్త సూక్ష్మాంశదర్శనం, రసికులకు ఆనందరసోపనిషత్తు. ఆయన ఎన్నో కావ్యాలు వ్రాశారు. అవి అన్నీ ఒక యెత్తు. రామాయణ కల్పవృక్షం ఒక్కటీ మరొకయెత్తు.

అందులోని కవితావైభవాన్ని అందించారు శ్రీజువ్వాడి గౌతమరావుగారు. అనంతముఖమైన విశ్వనాథప్రతిభనుగూర్చి ఎంతచెప్పినా తక్కువే! విరాడ్రూపానికి ఎంతపీట వేసినా చిన్నదే!

17-11-'74

జి. వి. సుబ్రహ్మణ్యం

# విశ్వనాథ కవితా వైభవం

కౌసల్య ముక్తి కాంతా సమానాకార
నలి సుమిత్ర యుపాసనాస్వరూప
విజయరమాకార వినయాంబుధి సుమిత్ర
కైకేయి మధుసామగానమూర్తి
కౌసల్య నవశరత్కాలమందాకిని
సితపుండరీకంబు శ్రీసుమిత్ర
మందార పుష్పంబు మహిళామణి సుమిత్ర
కైకేయి నునునల్ల కల్వపూవు

ధర్మకామంబు లీరెంట దశరథుండు
ముగురు భార్యలందును రసమూర్తులందు
నమృత సౌఖ్యానుభూతి నధ్యయన సుఖము
తీర్థభోగ సుఖమ్ము సిద్ధింపఁ గనియె.

దశరథునకు ముగ్వురు భార్యలు. కౌసల్య, సుమిత్ర, కైకేయి. ఇది అందరకు తెలిసిన విషయము. రామాయణ కల్పవృక్షములో మొదటి సారిగా

వీరి స్వరూప మీపద్యములో చెప్పబడినది. కల్పవృక్షము వాల్మీకమున కను వాదము కాదు. అనువాదమని చెప్పువా రనేకులున్నారు. వారు వాల్మీకి రామాయణ మను చదువక పోవచ్చును. కల్పవృక్షమునైన చదువక పోవచ్చును. రెండిం టిని చదువకపోవచ్చును. వాల్మీకిలో ఈ ముగ్వురిని గురించిన వర్ణన యిట్లు లేదు ఒక్క ఈ విషయముకోనే కాదు. అన్ని విషయములలోను కల్పవృక్షము స్వతంత్రకావ్యము.

కౌసల్య పట్టపురాణి. కైకేయి రాజునకు ప్రేమస్థానము. ఇరువురి మధ్య సుమిత్ర. గమనించ వలసిన యంశ మేమనగా-కవి సుమిత్రను కౌసల్యతో కలిపి యొకసారి కైకేయితో కలిపి యొకసారి చెప్పుచున్నాడు. కౌసల్య ముక్తికాంత వంటిది. సుమిత్ర ఉపాసనాస్వరూప. కౌసల్య శ్రీరామచంద్రుని జనని. ఉపాసనా స్వరూపుడైన లక్ష్మణుని సుమిత్ర కన్నది. ఇది యెప్పుడో భవిష్యత్తులో జరుగ బోవు విషయము. వారియందా యా లక్షణములు కవి మొదట నిక్షేపించు చున్నాడు. కైకేయి సామగానమూర్తి. పరమభాగవత శేఖరుడైన భరతు డామె కొడుకు. రామలక్ష్మణు లొక జంట. భరత శత్రుఘ్ను లొక జంట. భరతుని జంటయైన శత్రుఘ్నుడు విజయమునకు, వినయమునకు ప్రతీక. 'ఒక కౌసల్యకు దోడుగా నగుటయందో సర్వసాకేత బంధుకదంబాకృతి గాగనై మనుటయందో యన్నకు న్నాకు నొత్తుక నెయ్యంబిడు పుత్రులం గనుటయందో పేరు సార్థక్యమౌ నకలంకాత్మ సుమిత్ర యీ జనని క్షీరాంభోధి గంభీరయున్' ఇది ముందెప్పుడో భరతు డనుమాట. కాని మొదటనే ముగ్వురి రాణుల లక్షణములు చెప్పబడినవి. ముక్తికాంతా సమానాకారయైన కౌసల్యయందు దశరథుడు ఐహిక సుఖానుభూతికి మించిన అమృత సౌఖ్యాను భూతిని పొందుచున్నాడు. ఉపాసనా స్వరూపయైన సుమిత్రయందు అధ్యయనసుఖ మాయనకు కల్గుచున్నది. సామ గానమూర్తియైన కైకేయియందు ఇంద్రియాతీతము కాని తీర్థ భోగ సుఖము దశరథుడు పొందును.

ఈ ముగ్వురినిగూర్చి మరి మూడుమాట లున్నవి. నవశరత్కాల మందా కిని కౌసల్య. ఒడుదుడుకులు లేకుండ స్వచ్ఛముగా శాంతముగా ప్రవహించునది. ఒండు విరిగి తేరుకొన్న నీరము. ఆమెతో నున్న సుమిత్ర సితపుండరీకము; తెల్లని తామరపూవు. కైకేయియో నునునల్లకల్వపూవు. రాజు కంటికి డాగు రేకుల తళతళకాటుక. అక్కడి సుమిత్ర ఎఱ్ఱనికుందారము. ఈ సుమిత్ర

సత్త్వరజోమూర్తి. కౌసల్య సత్త్వమూర్తి. కైకేయి తమోమూర్తి. ఇది వస్తుధర్మ మును గూర్చిన వర్ణన. వట్టిరూపమును గురించిన వర్ణన కాదు.

రామాయణ కల్పవృక్షములో విశ్వనాథవారు కైకేయిని మలచిన తీరే విచిత్రము. కైకేయికి రామునియందమితమైన ప్రేమ. ఆతనికి చాపవిద్యను శిక్షించిన దామె.

> 'పటుబాహాపటుమూర్తి స్వామి ధనురభ్యాసంబు నిత్యంబు సే
> యుటయున్ గైకయి వచ్చి చూచుటయు'
> 'తనవి ల్లేగతి బట్ట నమ్ము నెటు సంధానింప గైకేయి శా
> సనమే శాసన మా రఘూత్తమునకున్'
> 'ఎలమిన్ తా నిది వేళపాళ యని లే దెల్లప్పుడున్ రామచం
> ద్రులు తానున్ దనకార్ముకంబు వడిజేరున్ గైకయీ సౌధభూముల'

వటువైన రామునకు కైకేయి 'వజ్రపుంఖితమైన వాలుటమ్ము'ను బిక్షగా వెట్టినది. అది చూచి

> 'మొగమున నింతయై మురిసిపోయెను రాముడు కైక కన్నులం
> దిగము మఱింత యింతయయి యేళ్లలు వాఱె దదంతరంతర
> స్థగిత రఘూద్వహప్రవిలసచ్ఛిశుమూర్తి మఱింత యింతయై
> జగములు పట్టరాని యొక సాహస దీర్ఘతనుత్వ మొప్పగన్.'

వారిరువురును పరస్పరము ఒకరినొకరు బాగుగా నెఱుగుదురు. ఈ రాముడు భవిష్యత్తులో దైత్యసంహార గాథా పాండిత్య సముద్ర మూర్తి కాగలడని కైక విశ్వాసము. ఆ విశ్వాసముతో నతనికి చాపవిద్య గరపుచున్నది. ఆ విశ్వాసము తోనే యతనికి వాలుటమ్ము భిక్షగా పెట్టినది. ఆ విశ్వాసముతోనే యతని నడవికి పంపించినది. కైకేయికి కావలసినది భరతుడు రాజగుట కాదు. రాము డడవి కేగుట. ఆ రామునకుగూడ కావలసిన దదియే. అతని నడవికి పంపించుటలో కైకేయి అపనింద పడినది. దుఃఖపడినది. దూషింపబడినది. విధవయైనది. అన్నియు నోర్చినది కాని వనమున కేగవలయునన్న రాముని వాంఛను సఫలము చేసినది. ఊరక మంథర బోధనలకు లొంగి రాము నడవికి పంపించినది కాదు. వట్టిమాటలకు మనస్సు మార్చుకొనెడి దైనచో మరల దశరథుని మాటలకు మార వచ్చును. సుమంత్రుని మాటలకు మారవచ్చును. వశిష్ఠుడు చెప్పినప్పుడు విన

వచ్చును. కాదు రాజు భరతుడే కానిమ్ము రామచంద్రుని అయోధ్యలో నుండ నిమ్మన్నప్పు డంగీకరింపవచ్చును. అత డడవి కేగవలయునన్న పట్టుదల యేమి? అకస్మాత్తుగా కైకేయి బ్రతుకులో కలిగిన ఈ మలుపునకు సమాధానము మరొకవిధముగా కుదురదు. ఈ వనవాసము రామచంద్రుడు కైకేయి ఇద్దరు కలిసి వేసిన పథకము. రాము డడవి కేగునప్పుడు ఇది కైకేయి యన్నమాట.

"...పోవోయి నీ

వనముల్ నా కొడు కిందు రాజగును నీ బాహాధనుః క్రూరమా
ర్గణముల్ చేయు నుపద్రవంబున మహాకాంతారముల్ ఘోషిలున్"

మహాటవులలో రాముని బాణములు చేయు నుపద్రవము లేమో కైకేయికి తెలియును. రామచంద్రునికి తెలియును. రామునకు బదులు తాను వన మేగెదనని భరతు డనినాడు.

'అనినం గైకయి యిట్లనెన్ దగుదురా యన్నా! మరీ వేగి కా
నన మేమౌదువు రామచంద్రు డనినన్ బ్రధ్మాంతుతేజో వినూ
తన నారాయణమూర్తి శాసితసమస్తప్రాణి నీ వేగుటా
తని దౌ యేగుట యొక్కడా? భయసముద్రంబయ్యె నీ మాటలున్'.

ఇది విశ్వనాథవారి కైకేయి. ఈ కైకయందు రాముడు సర్వధా కృతజ్ఞుడు. ఇది మరింత వివరముగా వ్రాయవలసిన విషయము.

## 2

ప్రభుమేనిపై గాలి పైవచ్చినంతనే
పాషాణ మొకటికి స్పర్శ వచ్చె
ప్రభుకాలిసవ్వడి ప్రాంత మైనంతనే
శిల కొక్కదానికి చెవులు కలిగె
ప్రభుమేని నెత్తావి పరిమళించినతోన
యశ్మంబు ఘ్రాణేంద్రియంబు బెందె
ప్రభునీలరత్నతోరణ మంజులాంగంబు
కనవచ్చి రాతికి కనులు కలిగె

ఆ ప్రభుండు వచ్చి యాతిథ్యమును స్వీక
రించునంత నుపలహృదయవీథి
నుపనిషద్వితాన మొలికి శ్రీరామభ
ద్రాభిమమూర్తి యగుట దోచె.

శ్రీరామచంద్రుడు గౌతమాశ్రమమున ప్రవేశించుటతోడనే పాడుపడి యున్న యాశ్రమ మొక్కసారిగా కలకలలాడినది. పంచభక్ష్యపరమాన్నము లిరవొందుచున్న పళ్లెరముతో, గాంగవారి కమండలువుతో అన్నపూర్ణాదేవియన ప్రవేశించిన యహల్య రాముని స్తుతించినది. ఇది అందులోని చివరిపద్యము.

శిలగా పడియున్న అహల్యలో క్రమముగా వచ్చిన మార్పు ఈ పద్యములో సూచింపబడినది. పంచభూతాత్మకమైన దీతనువు. శబ్దస్పర్శరూపరసగంధాదులు పంచేంద్రియములకు సంబంధించినవి. శిలయైన యహల్య కి వేవియు లేవు. ప్రభువైన రామచంద్రుడు సమీపించినకొలది పాషాణమునకు స్పర్శ, శిలకు చెవులు, అశ్మమునకు ఘ్రాణము, రాతికి కనులు ఒకదానివెంట నొకటి కలిగినవి. ఈ పంచభూతములకు ప్రభువు స్థానము. అనగా సృష్టికి మూల మా ప్రభువు. ఉపనిషద్వితాన మా ప్రభుస్వరూపమును చెప్పును.

అహల్యా శాపవిమోచనము చెప్పుట ఈ పద్యమునందలి సామాన్య విషయము. రామచంద్రుని ప్రభుస్వరూపమును చెప్పుట విశేషవిషయము. ప్రభువనగా సమర్థుడని సామాన్యార్థము. ప్రకృష్టమైన పంచభూతజననము తన యందు కలవా డని విశేషార్థము.

### 3

శ్రీసతి ఫుల్లగల్ల పరిచిహ్నిత కుంకుమ పత్రభంగ వి
న్యాసితరమ్యవక్షః! రఘునాయక బాలక! రామచంద్ర! కై
లాసము పైని దేవుడును లాచిన కామినియందు గల్గులి
ప్పాసముదక్షుడైన పసివాడునుబోలె చరించునే కదా!

ఒక్క విశ్వామిత్రు దేమి? స్త్రీ వాంఛతో తలమున్కలైనప్పుడు కైలాసము పైని దేవుడును పసివానివలె చరించునుకదా. ఇది శతానందుడు శ్రీరామునకు

విశ్వామిత్రుని కథ చెప్పుచున్నపు డన్నమాట. పద్యము మొదట నున్న సంబోధన ఈ పద్యములోని ప్రత్యేకత. ఒక కథ చెప్పుచున్నపుడు ఈ కవి కొన్ని సంబోధనలు చేయును. సామాన్యముగా అనేక సంబోధనలు చేయవచ్చును. ఆ సంబోధనలు శ్రీరామచంద్రుని గురించిన వైనప్పుడు అవి యసంఖ్యాకములుగా నుండవచ్చును. వట్టి సంబోధనలలో సందర్భశుద్ధి యుండదు. 'పయోరుహాననా జలజాతనేత్ర' వంటివి. అవి యెప్పుడైనను ఎవరిగురించియైనను చేయవచ్చును. విశ్వామిత్రుని కథలో మొదటిది వశిష్ఠ విశ్వామిత్ర యుద్ధము. విశ్వామిత్రుడు వశిష్ఠునిపై ననేకాస్త్రములను ప్రయోగించెను. అక్కడ శతానందుడు కథవిను చున్న శ్రీరాముని 'సర్వకార్ముక విద్యాప్రశస్తహస్త!' యని సంబోధించెను. ఇక్కడ నున్న సంబోధనలో శృంగారస్పర్శ యున్నది. ఈ విశ్వామిత్రుని కథలో ఇటువంటి సంబోధన మరొకచోట లేదు. కారణ మేమనగా శ్రోతయైన రామునియెడద అప్పుడే మన్మథునిచేత స్పృశింపబడుచున్నది. రాముని వయోవస్థ ఈ కథను అతని మనస్సునందు విశేషముగా ముద్రితము చేసినది. అందుచేత ఆ సంబోధన. ఎంతమధుర భావావిష్కారముగ సాగిన దీ సమాసము! రామాయణ కల్పవృక్షములోని సంబోధనలన్నియును వానిలోని మాధుర్యముతో బాటు విశేషభావస్ఫూర్తిని గూడ కలిగించునవి.

## 4

చుఱచుఱ నెట్టినై చూచెడు చివురాకు
　　　చివురాకు వెనుక పొంచిన లతాంత
బాణుండు విసరగా బట్టిన పిడిబాకు
　　　పిడిబాకు రివ్వున విసర దూసి
సన్నసవ్వడివోని సన్నని పికివాకు
　　　పికివాకుతో మేళవించి సన్న
గొంతురాగముతోడ కులుకు నచ్చర సోకు
　　　పిరుపీకుగా నొక్కపెట్ట దోచి

తోఁచు టాలస్యముగ గింకిణీ చిణచిణ
నినదకన దబ్జ పదసమానీత మధుర
గీతికారసవార్ధి పొంగిన తరంగ
మచ్చరయు గన్నులను హృదయమున బొడువ.

ఈ పద్యరచన యొక యాశ్చర్యము; దీని సొగసు చెప్పనలవికాదు. శ్రవణ సుఖము ప్రధానముగా గోరుకొనెడి వారి కిది కల్పించెడిహాయి ఇంతని కాదు. విశ్వామిత్రుడు ఘోరముగా తపస్సు చేయుచున్నాడు. ఆ తపస్సున కనేక విఘ్నములు. మేనక కలిగించిన దొక విఘ్నము. ఇప్పు డింద్రుడు రంభను పంపుచున్నాడు. విశ్వామిత్రు డప్సర స్తన సుఖప్రాచీనుడుకదా! రంభకు లొంగి రావచ్చును. ఇది ఇంద్రునియూహ. ఇంత తపస్సు భంగించుటకు రంభ యొక్కతే చాలునా! 'నిను నొక్కతె గాని పనుతునే యట నే నుందును పుష్ప బాణుడుండును, నినదత్తికి మధురభావ పేషణి యుండున్'. ఇది వెనుక ముందగు చున్న రంభతో ఇంద్రు డన్నమాట. అన్నవాడు రంభను తిరిగి మాటాడనీయ లేదు. తరుముకొని పోయినాడు. పదపద మని చిలుకపౌజుకు కోకిల బాకాలును గా నందఱు కౌశికీ తీరము జేరినారు. ఒండు రెండు చిలుకలు గావు చిలకలదండు. దండు కాదు. పౌజు. కోకిల లొకటి రెండు కూయుట కాదు. అవి బాకా లూదు చున్నవి. సర్వప్రకృతి యిట్లె మారినది-అకస్మాత్తుగా అనంతరమణీయముగా.

దాడి చేసెడి వా డింద్రుడు. ఆతనికి విశ్వామిత్రుని పట్టుదల తెలియును. వనము వెఱ్ఱిగా చిగురించినచో చాలదు. చిలుకలు కనబడినను లాభము లేదు. కోకిల కూసినను దండుగే. అచ్చర పాడినను వ్యర్థమే. ఇవి యన్నియు కావల యును కాని వేరువేరుగా కాదు. ఒక్కుమ్మడిగా విశ్వామిత్రుని కూపిరాడకుండ ఇవన్నియు జరుగవలయును. అందుకే చివురాకు చివురాకు, పిడిబాకు పిడిబాకు, పికివాకు పికివాకు, ఈ ముక్త పదగ్రస్తము. అప్పటి యాప్రకృతి ఎంతరమణీయ ముగా నున్నదో ఆ పద్య మంత రమణీయముగా నున్నది. విశ్వనాథ సత్య నారాయణ పరమమధురముగా రచనచేయు ననుట కీ పద్యము సాక్షి. ఇటువంటి వనేకములు.

## 5

నిష్ఠావర్షదుదార మేఘపటలీ నిర్గచ్ఛదుద్యోతిత
స్పేష్ఠేరమ్మదమాలికాయుగపదుజ్జృంభన్మహాఘోరబం
హిష్ఠ స్ఫూర్జథుషండ ఘుర్ఘుర రవాహీనక్రియా ప్రౌఢి ద్రా
ఘిష్ఠమ్మై యొక రావ మంతట నెసంగెన్ ఛిన్న చాపంబునన్.

రామాయణ కల్పవృక్షములో నిది మిక్కిలి కఠినమైన పద్యము. విశ్వనాథ సత్యనారాయణ కవిత్వము మిక్కిలి కఠినముగా నుండుననుటకు అనేకుల చేత ఈ పద్య ముదాహరింపబడుచున్నది. ఆయన ఎంత మధురమైన రచన చేయునో అంతకఠినమైన రచన చేయును. ఆయనయే కాదు మహాకవులందరును చేయుదురు. ఈ పద్యము నిస్సందేహముగా కఠినమే. కఠిన మగుటలోనే దాని సార్థక్యము.

శ్రీ రామ చంద్రుడు హరధనుర్భంగము చేయగా ఆ ఛిన్న చాపము నుండి వెడలిన పరమదీర్ఘమైన, పరమకఠోరమైన ధ్వనిని స్ఫురింప జేయుట ఈ పద్యము యొక్క ప్రయోజనము. 'ద్రాఘిష్ఠమ్మై యొక రావ మంతట నెసంగెన్' ద్రాఘిష్ఠ మనగా దీర్ఘతమము. పద్య ప్రారంభమునుండి సాగిన సమాసము ఆధ్వని యొక్క దీర్ఘత్వమును సూచించుచున్నది. 'ఎడతెగకుండ వర్షించుచున్న అమోఘమైన మేఘముల సమూహము నుండి మిక్కిలిగా వచ్చు మెరుపుతీగలతోబాటు విజృంభించు పిడుగుల సమూహముల యొక్క ఘుర్ఘుర ధ్వనిని తక్కువ చేయునట్లుగా మిక్కిలి దీర్ఘమైన ఒక రావము ధనుస్సు నుండి వెలువడెను' ఇది ఈ పద్యభావము. ఈ భావము చెప్పకుండనే ఆ రచన చేత తెలియుచున్నది. షకారముతోకూడి దీర్ఘ ఠకారము స్పేష్ఠే యన్నచోట ధనుర్భంగమప్పటి విస్ఫోటమును సూచించుచున్నది. ఆ రావము యొక్క కాఠిన్య మెటువంటి దనగా ఆధ్వని వినాయకుని చేటలవంటి చెవి తొఱ్ఱలకు సిగ్గు కలిగించినది. కుమారస్వామిని తన పన్నెండు నేత్రములను విచ్చి చూచునట్లు చేసినది. పార్వతీదేవి యొక్క ఫాలమండలమునకు విభుగ్న క్రీడమైనది. ప్రమథుల చేత ఆః ప్రకట రావము కల్గించినది. ఆ పద్య మిట్లున్నది

హేరంబోన్నత శూర్పకర్ణ వివరహ్రీకారియై షణ్ముఖ
స్ఫార ద్వాదశనేత్ర గోళవివృతి ప్రాకారమై శైలక

న్యారాజన్నవ ఫాలమండల విభుగ్న క్రీడమై ఆశ్చల
ద్దీరుగ్ర ప్రమథంబుగా ధనువు మ్రోగెన్ శైవలోకంబులన్.

అంతటి మహాధ్వనిని మధుర శబ్దసంయోజనము చేసి చెప్పుట సమంజ సమా ? శిల్పియైన కవికి శబ్దమునందు పక్షపాత ముండదు. మరియు మాధుర్యము వేరు. సౌందర్యము వేరు. కేవల మధురశబ్ద సంయోజనము సర్వత్ర ప్రయోజనకారి కాదు. మీసములు లేకుండ భీమసేనుని వేషము వేసినచో నటన సంగతి యేమోకాని మొదట వేషమే యందముగా నుండదు. కావ్యశిల్పము యొక్క ప్రాథమిక లక్షణములు తెలిసినవా రెవరైనను ఈ పద్య మిట్లుండుట లోని సామంజస్యమును గుర్తింపక పోరు.

శివధనుస్సు రెండు ముక్కలుగా నడిమికి విరువబడినదని తెలిసిన పరశు రాముడు అఖిలసంహార కాలాగ్నివలె దుస్సహుడై విచ్చేసెను. ఆ వచ్చినవాని యౌద్ధత్య మిట్లున్నది.

'ఎవడురా వాడు ? లోకేశ్వరు, కైలాస
పతి పరంజ్యోతి కపర్దిధనువు
మర్దితముగాగ విరిచిన మగతనంబు
కర్దమముగాగ బొంగిన కంధితరగ
ఎవడురా యాతడు ? ప్రమథపృతనకు
బడవాలు హేరంబునకు వెల్లబాటుజోదు.'
"ఆ స్వామి కెవ్వండురా ?
కూడం గన్నుల విప్పు దెచ్చెను ధనుష్కోటివిభుగ్నోద్ధతిన్'"
"తల్లిదగు ఫాలంబందు నీనాటికిన్
క్షుభ్యత్కోపలతాప్రణేత యగు నాక్రొవ్వాడి యెవ్వాడురా ?"
"ప్రమథులచేత ఆః ప్రకటరావమ్ము కల్గించినట్టి
ఇముడ జాలని క్షత్త్రబంధు వెవడురా ? ఎవడురా వాడు ?"
"ఎవ్వడురా ? త్రిలోచనునహీనమహాధను వెత్తి . "

ఇది వరుస ఆ పరశురాముని ఈ తొందర యేమి ? మొదలుపెట్టుచునే ఎవడురా వాడు ? అని మొదలుపెట్టెను. లోకేశ్వరుడు, కైలాసపతి, పరంజ్యోతి - ఆ కపర్ది ధనువును విరిచినవా డెవడు ? ప్రమథులసేనకు బడవాలైన వినాయకు

నికి విన్నదనము కలిగించిన వాడెవడు ? స్వామికన్నులలో విప్పను దెచ్చిన వాడెవడు ? తల్లి ఫాలమందు కోపలతా ప్రణేతయైన వాడెవ్వడు ? ప్రమథుల కాశ్చర్యము కలిగించిన వా డెవడు ? ఈ విధముగా శివలోకముల నల్లకల్లోలము చేసిన వాడెవడురా ? ఎవడురా వాడు ? వాడు సాక్షాన్మహావిష్ణువు కాదు గదా ! వానిని చూడవలయును. ఈ పరశురామునకు నిజముగా కోపము వచ్చినదా ? ఊరక యట్లు విజృంభించుచున్నాడా ? రాముడు మారు పల్కుటతోనే ఆయన అంత యౌద్ధత్యము అంత చంక్రమణము విరిసిపోయినది. అప్పుడు మృదుతర సుహాసవదనుడై బాలరాఘవుపలన జూచి ఇట్లన్నాడు.

'నీవటోయీ ! యోయి ! నెట్టికసీల! నీ
వా శైవధనుసును వంచినావు
నీ తాకినంత నా నిగుడు రుద్రధనుస్సు
వెదురుబద్దయువోలె విరిగిపోయె
ఏలాగు విరిగెనో నీలకంధరు మహా
ధనువు చెప్పుము నేను వినవలతును
పనిబూని విరిచితివా ? తాకినంతనే
విరిగెనా మంజూష వెలికి తీసి

పూనితివ? యెక్కు పెట్టితివా? నితాంత
మైన జ్యావల్లి సంధితమైనదా ? యె
దీ! కథారీతి చెప్పుము, తిగిచినట్టి
యమ్ము ఏలక్ష్యమును దాకి వమ్ముచేసె?'

ఈ పద్యరచనయొక్క వైశిష్ట్యము తెలియుచునేయున్నది. 'చుఱచుఱ నెట్టనె చూచెడు చివురాకు, 'నిష్ఠావర్ష దమోఘ మేఘపటలీ, నీవటోయీ! యోయి నెట్టికసీల' ఈ మూడు పద్యములును ముప్విధములైన రచనల కుదాహరణ ములు. పై ఉద్ధృతికి ఈ మాటలకు పోలికయే లేదు. నీవా వంచినది? నీ తాకి నంతనా విరిగినది? పద్య మెక్కడికక్కడ విరిగి పరశురాముని తఱచి తఱచి యడుగుటను ఆయన యాశ్చర్యమును సూచించుచున్నది. పద్యార్థములోనే కాదు. పద్యరచనలో గూడ నొకభావమును విస్పష్టముగా ప్రకటించుట యిట్లుండును.

'వెనుకకు దిరుగడు తఱుముచు
జనును త్వరాయాన విధృతి జనుచోభూభృ
త్తనయులు త్రిశీర్షభుజగగ
మనవల్గన సుందర సుషమామధుమూర్తుల్.

వెనుకకు దిరుగడు తఱుముచు
జనుముని దాశరథు లాత్మస త్తేజస్సం
జనితసుషమాదశదిశా
కనత్ప్రభాక్షీరనిధి చకచ్చకితాంశుల్

వెనుకకు దిరుగడు తఱుముచు
జనియెడు మునిరాజు రాజశాబకములు రో
జనినవమధుర స్వేదాం
బునిపీతానిలతరంగమోహనమూర్తుల్.'

విశ్వామిత్రుని వెంటబడి వేగముగా నడచుచున్న రామలక్ష్మణుల గమనశోభను యీ పద్యములు పట్టియిచ్చుచున్నవి. ఈ పద్యములనడకయు వేగము కలది. శబ్దార్థములు తెలిసినంతనే కావ్యార్థము తెలిసినట్లు కాదు. అప్పుడపుడు పద్యము నడకలో పద్యార్థము దాగియుండును. మరియొక ఉదాహరణ-

'లలితశ్వేతమనోహరాపఘనలున్ సందేహకృన్మధ్యలున్
కలశీముగ్ధపయోధరల్ కఠినజంఘల్ బాలచంద్రాంశుఫా
లలు నేత్రాంచలసంభవన్మదనహేలల్ రత్నమాణిక్య కుం
డలలున్ వెంబడివచ్చుచున్ కొలచుచుండన్ చామరగ్రాహిణుల్.'

వీరందరు రావణుని వెంబడివచ్చుచున్న చామరగ్రాహిణులు. ఆ మహా పురుషుని రాజస మెంతో ఈ పద్యము చెప్పుచున్నది.

## 6

అవు నిల్లలుకంగనె పండుగ కా దంభోదోద్య ద్రాక్షసరాజుల్
వివృతానను లుద్యతబాహులు పృథ్వీఘోషా పర్యాప్తభుజోగ్రుల్
దవులం జనుదెంతురు మీదగు నీ దర్పావేశాధఃకృతి బుద్ధుల్
నవలా చెవులున్ మునునాసికయున్ నద్ధంబెట్టం బండవు ప్రజ్ఞల్

కోటుల్ లక్షల్ దానవబలములు క్షోదింపన్
నీటుల్ గోటుల్ సాగవు పోసగదు నిల్వంగన్
ధాటీ ఘోటీ ఘట్టన శకలిత దర్పంబౌ
నాటోపంబున్ జూపగ వెలదుక యన్నట్లా

ఎంతలేసి కుటిలులురా
వింతలైన వలపులురా
జంతలింక దెలియునులే
స్వాంతమందు శిఖు లెగయున్

సురారాతి
స్ఫురత్సైన్యం
బురోఽసృగ్ధా
రరాదీయన్.

'అని దూర దూరంబుగ నామె బెదరింపుమాటలు వినన్నైన'.

లక్ష్మణుడు ముక్కుచెవులు కోయగా మింట నెగిరిపోవుచు శూర్పణఖ యన్న మాట లివి. ఇవి నాల్గువృత్తములు. మొదటిది లాటీవిటము. రెండవది అసంబాధము. మూడవది హలముఖ. నాల్గవది క్రీడ. ఈ వృత్తములలో మొదటిది దీర్ఘమైనది. తరువాతివి ఒకదాని కంటె నొకటి చిన్నవి. నాల్గవది మిక్కిలి చిన్నది. అందు లోని వాక్యమసంపూర్ణము. ఇవి దూరదూరముగా వినబడుచున్న శూర్పణఖ బెదరింపు మాటలు. చివరిది సరిగా వినబడలేదు.

వృత్తము నెన్నుకొనుటకూడ కావ్యశిల్పములోని భాగము. ఇల్లలుకగానే పండుగ కాదు. అంభోదాలవంటి అదరిపడే రాక్షసరాజులు నోళ్లుతెరచుకొని చేతు లెత్తికొని రాగలరు. వారు మీ దర్పావేశాధఃకృతి బుద్ధులు. అనగా మీ గర్వా వేశమును క్రిందుపరచు బుద్ధి కలవారు. ఒక యాడదాని ముక్కు చెవులు కోయు టతో మీ ప్రజ్ఞ పండినట్లు కాదు. ఈ మొదలైన మాటలన్ని శూర్పణఖ నిస్సహాయ తను, తనవారి బలమును, ఎంటివారి మీద కసిని, ముంచుకొని వచ్చు దుఃఖ మును ఒక్కుమ్మడిగా వ్యక్తము చేయుచున్నవి. ఈ పద్యము నడకే యట్లున్నది.

పాదము సగము ఒక విధముగా, మరొక సగము మరొక విధముగా. అవుని / ల్లలుకం / గనెపం / డుగకా - ఇదియొక తీరు. అంభోదోద్య ద్రాక్షసరాజుల్ ఇది మరొక తీరు. ఈ మాటలన్నియును సామాన్యములైన వృత్తములలో ఈ యర్థము వచ్చునట్లే చెప్పవచ్చును. కాని రచనలోని ఈ చమత్కారము, ఈ వైవిధ్య మచ్చట నుండవు. శూర్పణఖ మాటలలోని యర్థమే అక్కడ స్ఫురించునుకాని మరొక విశేష మక్కడ స్ఫురించదు. అందుకే యన్నది కేవల శబ్దార్థములు విచారించుట కావ్యార్థమును విచారించుట కాదని. శబ్దముల కర్థములు నిఘంటువులలో దొరకును. విశేషార్థములు భావుకుని మనస్సులో దొరకును. రామాయణ కల్పవృక్షములోని రాక్షసపాత్రలు విశిష్టములైనవి. విరాధుడు, కబంధుడు, కుంభకర్ణుడు, రావణుడు ఎవరైననేమి? వారిలో నొక జ్ఞాన మున్నది. రాము డన్నచో యనురాగ మన్నది. వారందరును శాపగ్రస్తులై రాక్షసులైనవారు. ఈ రాముడు వారికి శాపవిమోచనము కలిగించువాడు. వా రితనికై యెదురు చూచుచున్నవారు. ఎదురు చూచుచున్నంతకాలము మహాబాధ ననుభవించుచున్నవారు. 'నీకయి వేచి యుంటి ప్రభువా! దీవ్యద్భుజాశ్రీధనుశ్శంపానీరదమూర్తి! నిన్ను గురితింపం జాల కెట్లయ్యేడున్' ఇది విరాధు డన్న మాట. ఏమో ఇతడు రాముడగునోకాదో మునివేషధారులై వేరే రాకుమారులు వనీయాత్రాగతి రాకూడదా?

> 'అవునో కాదో యనియెడి
> లవమనుమానంబు రామలక్ష్మణులము, నా
> ధవ! చెప్పినంత దీరిన
> దవల ప్రభూ! యెంత తగ్గి యాడితి గంటే.'

అని విరాధుడు 'ఓయీ రఘుస్వామీ! ధర్మభ్రంశంబున కడ్డుపడెడు నీ పదమును నా కంఠమందు జేర్పు'మన్నాడు. అది విరాధుని లక్షణము. ఈ రాముడు రాక్షసులను సంహరించును. రాక్షససంహారము తనకు తప్పక వచ్చినది. ఆ వధించిన రాక్షసులను గురించి యూహించి మరల మిక్కిలి విషణ్ణుడగును.

> 'వాని ప్రమందించుటేలా? యీ చంపుటయో కసాయిపని
> మేలన్నట్లుగా నున్నదయ్యో, యాకత్తులగ్రుమ్మ
> పేషణము ప్రాణోత్క్రాంతిదుర్భావ్యమో'
> 'ఊహకు నందదే బ్రదికియుండిన వానిని పూడ్చిపెట్టినామే హరి!'

అని రామచంద్రుని విచారము. 'ఏదనుజున్ వధించినను నిట్టి విషాదము నొందు నాత్మమర్యాదుడు స్వామి' అని యొకచోట జానకీలక్ష్మణు లనుకొందురు. ఆ రాక్షసు లట్లు. ఈ రాము డిట్లు. కొంత భగవద్భాగవతసంబంధము వీరిలో లేకపోలేదు.

## 7

'సింహంబు కావచ్చు జిట్టులాడుచువచ్చు
వనవరాహమ్మ కావచ్చు స్వామి
తృణమైన గావచ్చు దిందుకాశోకచం
పకవృక్షవితతి కావచ్చు స్వామి
శ్యేనంబు కావచ్చు జిరజీవి దాత్యూహ
బక కోకములును గావచ్చు స్వామి
ఖడ్గంబు కావచ్చు కపిసృగాల లులాయ
భాలూకములును కావచ్చు స్వామి

నాకు బదిక్రోశములను మింటను ధరిత్రి
భూతసంతాన మాకృష్టముగ నొనర్చి
యెవరో చేతులు నరుకగా నెదురుచూచి
చేతకాని మృగాళి భక్షించుచుంటి' !

విరాధుడు కబంధుడు శాపగ్రస్తులైన గంధర్వులు. వారు రామునికై అడవిలో వెదకుచున్నారు. వారిలో గంధర్వత్వభావ మున్నది. పైశాచికమైన దేహ మున్నది. ఈ పైశాచిక దేహమున కున్న బలము ఆ గంధర్వభావము నణగద్రొక్కుచున్నది. ఇది కబంధునిలో మరియు విస్పష్టముగా నున్నది. ఇంతింత తీరని క్షుద్దాహములతో దీర్ఘమైన బ్రదుకుతో రామదర్శనమునకై కబంధుడు పడుచున్న యార్తి వర్ణించుట కలవికానిది.

'ఆగుబ్బైన ప్రతీక్షచే కటికి జాయైతిన్ క్షుధాయంత్రమై'. క్షుధాయంత్రమైన ఈ జీవుని వేదన యెంతగాఢమైనదో ? జగన్నాథుడైన యా స్వామి

ఎచ్చట నున్నవాడు? ఇచ్చటి కెప్పుడు వచ్చు? వచ్చి నా యుమ్మలికంబు వాపు? ఇది కబంధుని బాధ. ఎట్లుండు నా స్వామి? తృణములో పణములో చెట్టులో చేమలో ప్రాణిలో స్థాణువులో ఇందు గల డందు లేడను వాడు ఏదో యొక రూపములో నా చేతులు నరుకగూడదా? ఈ యెదురు చూచుటకు చివర యెక్కడ? ఎప్పుడు? స్వామి సింహమా? పందియా? ఏమో? ఇదివర కైనా డేమో? తృణమా? తిందుక, అశోక, చంపక వృక్షములలో నొకడా? డేగయా? కాకియా? కొంగయా? కోకమా? ఖడ్గమృగమా? కోతియా? నక్కయా? దున్నపోతా? భల్లూకమా? ఓహో! ఈ మహాన్వేషణకు చివర యెక్కడ? స్వామి ప్రత్యక్షమగు వరకు ఈ యన్వేషణ సాగనే వలయును. ఈ యార్తి, ఈవేదన, ఈ యన్వేషణ యంతయు ఫలించిననాడు

"చివరకు రామలక్ష్మణులు సీవరికల్వలు మంచుతుంపురుల్
చివురులు ముగ్ధ సంచరదుశీర సమీర కుమారమూర్తులం
ధువు పెనులోతు త్రవ్వినను నూల్కొను కొబ్బరి పాలవంటి సీ
రవిసిన యట్టి పెద్ద జలంబై చనుదెంచితి రీరు మీరలై"

వేదనాగ్నిలో తపించిన వానికి భగవద్దర్శనమింత చల్లగా నుండును. కబంధుని యంత తపనయు ఇట్లు సార్థకమైనది.

## 8

నాకున్న నిద్రయు నాయన్నగారన్న
నాకున్న భక్తియు నన్ను దొలచె
కాకున్న స్వర్గమో లేకున్న ధాత్రియో
కడుసమాయత్తమయ్యెడిది నాకు
నా హృదంతరము మానాథుండు పాలించు
నాదేహమలు పాలనద్దపడదు
ఆ రామమూర్తి నారాయణుండైనచో
అతని విల్లును శార్ఙ్గమైన యెడల

మనము భయపడవలయు సంశయమె యున్న
నన్ను బంపడుసుమి దైత్యనాయకుఁడు
సర్వకాల జాగ్రద్భావ సంయుతుండు
అనుజభావ మర్యాదారహస్యవేత్త.

రావణుడు కుంభకర్ణుని మేల్కొల్పి విషయము వివరించి యుద్ధమునకు పంపును. యుద్ధమునకు పోవుచున్న కుంభకర్ణుడు తన మంత్రులతో నన్నమాట యిది. కుంభకర్ణునియందు రెండంశము లున్నవి. ఒకటి నిద్ర. రెండవది అన్న యందలి భక్తి. ఈ రెండు లేకున్నచో అతడు స్వర్గమునకో భూలోకమునకో అధిపతి యయ్యెడివాడు. వాని పరాక్రమ మంతటిది. అసలు వానికా లోకాధి పత్యములే యవసరము లేదేమో? హృదంతరమును పాలించెడు ఉమానాథు డుండగా ఇవి యెందులకో? అతని దేహము అల్పముగా కొట్టబడెడిదికాదు. ఇక దేనినిగూర్చి భయపడవలయును? ఆ రాము డేమి నారాయణుడా? ఆ మాట యనుటలోనే కుంభకర్ణుని నిశ్చయము బయటపడుచున్నది. వట్టి రాముడని యనడు. 'ఆ రామమూర్తి' యనును. ఆయన నారాయణుడని, అది శార్ఙ్గమని అతనికి సందేహము లేదు. ఈ తమ్ము డెంత నిద్రాముద్రితుడో ఆ యన్న అంతగా జాగ్రద్భావసంయుతుడు. తమ్ము డెట్టివాడన్న మర్యాదారహస్య మెరి గినవాడు. సంశయ మున్నచో తనను పంపనే పంపడు. అన్నయందలి వాని విశ్వాస మట్టిది. దీని పర్యవసాన మెరిగియే కుంభకర్ణుడు యుద్ధమునకు బయలు దేరినాడు ఎరిగినవాడు కనుకనే తన యనుచరులతో నిట్లనినాడు.

'మీరు నాతోడ నేటికి మిత్రులార
దారపుత్రులు కలిగిన వారు మీరు'
'అత డాతండె యైనచో నమర మీరు
నను ననుసరించినను ప్రయోజనము లేదు
యాత డాతండు కానిచో నమరదోడు
చనగనేమియు నా కవసరము లేదు.'

నిద్రలేచినంతనే కొండంత మాంసము తిని, అకూపారమైన మద్యము త్రావు కుంభకర్ణుని మనస్సు మెత్తన యిటువంటిది. వాని వివేక మటువంటిది. చమ త్కార మేమనగా ఈ రామాయణకల్పవృక్షములో రాముని నారాయణత్వము

ఇటు మునులకు అటు రాక్షసులకు ఇరువురకును తెలియును. మునులయం దిది సువ్యక్తము రాక్షసులయందు అవ్యక్తము

## 9

ఆకృతి రామచంద్ర విరహాకృతి కన్బొమ తీరు స్వామి చా
పాకృతి కన్నులన్ ప్రభు కృపాకృతి కైశికమందు రామదే
హాకృతి సర్వదేహమున యందున రాఘవ వంశమౌళిధ
ర్మాకృతి కూరుచున్న విధమంతయు స్వామి ప్రతిజ్ఞ మూర్తియై.

అశోకవనిలో నున్న సీత రావణునకు కన్పించిన తీరు ఈ పద్యములో చెప్పబడినది. రామచంద్రుని విరహమే రూపొందినట్లుగా నున్నది సీత యాకారము. ఆమె కన్బొమ తీరు రాముని ధనుస్సువలె నున్నది. కన్నులు రాముని కృపాస్థానముల వలె నున్నవి. ఆమె కేశపాశము రాముని దేహకాంతితో తులతూగుచున్నది. సర్వదేహమునం దామె రాముని ధర్మము మూర్తి గొన్నట్లు న్నది. ఆమె యచ్చట కూర్చున్న తీరు రాముని ప్రతిజ్ఞవలె నున్నది.

సీత రామునికి భిన్నముగా నున్నది కాదనుటే ఈ వర్ణన. ఆమె యందు సువ్యక్తముగా నున్న సర్వమును రామునికి సంబంధించినదే. రామచంద్రుడు దయామూర్తి. సీతకన్నులామాట చెప్పుచున్నవి. కాని మించి వచ్చినపు డేమగునో ఆమె కనుబొమలు చెప్పుచున్నవి. రాముడు ధర్మప్రతిజ్ఞుడు. ఆయన శృంగారము ధర్మబద్ధము. ఆయన ప్రతిజ్ఞకు తిరుగులేదు. ఇది యంతయు ఆమె కైశికమునందు అమె సర్వదేహమునందు ఆమె కూర్చున్న విధమందు గోచరించుచున్నది. ఇదియంతయు సీత. ఈ సీతాస్వరూపము రావణు డెరుగునా? ఎరుగ డనుటకు వీలులేదు. ఎరుగడన్నచో సీత యట్లు కనపడవలసిన యవసరములేదు. సీత యట్లు కనపడినదనగా రావణుడు రామచంద్రుని స్వరూప మెరుగునన్నమాట. ఎరిగియు దానిని మరుగుపడనిచ్చెడివాడు రావణుడు. ప్రొద్దున మేల్కొనుటయే యాలస్యము. సీతను చూచుటకై పరుగెత్తి కొని వచ్చినవాడు రావణుడు. ఇవి యత దన్నమాటలు.

'ప్రాతస్తుషార సంభారవాహులచేత
మేల్కొల్పబడి స్పర్శ మృదులచేత
శైశిర పవమాన సార్ధవాహులచేత
పుష్పకంబున నిద్రపోవుచుండి
యానిమేషమున నన యౌగపద్యముగాగ
స్మృతిపథంబున సమర్పింపబడితి
సాభిలాషా కరాంచలలైన యీ సతీ
కరములు మెల్లన పరిహరించి

యొరిగి నాయెదలోన గూర్చున్న నిన్ను
భావనేత్రపథంబున పదిలపరచి
సరి యశోకవనాంత నిషణ్ణవైన
నిన్ను కనుగొంటకై వచ్చియున్నవాడ.'

రావణుడు సీతతో మాటాడిన మాటలన్నింటిలో ఈ పద్యము మకుటాయమైనది. పుష్పకమున నిద్రపోవుచున్న రావణుడు ప్రాతఃకాలమందలి మంచు తుంపురులను మోసికొనివచ్చుచున్న స్పర్శమృదువులైన పిల్లగాలులచేత మేల్కొల్పబడినాడు. మేల్కొల్పబడిన యా నిమేషమందు యౌగపద్యముగా సీత యాతని స్మృతిపథములో తోచినది. మేల్కొనిన తరువాత కాదు, మేల్కొనుటతోబాటే. అటు మెలకువ ఇటు సీతాస్మృతి రెండు నొక్కసారిగా కలిగినవి. అనగా నిదురలోకూడ సీతను ధ్యానించుచున్నాడా మహానుభావుడు. ఆ మహాదేవి ఆతనియెదలో యొరిగి కూర్చున్నది. అతనియందు మక్కువగల స్త్రీలు అతనిని కౌగలించుకొనుచుండగా వారిని వదలించుకొని సీతను చూచుటకై యతడు వచ్చినాడు. ఆమె యశోకవనానంతనిషణ్ణ. సాంసారికములైన దుఃఖతాపాదుల కవ్వల నున్నదా తల్లి. తన భావనేత్రపథమునందు కదలకుండ యామెను పదిలపరచినవాడు రావణుడు. రావణుడు సీతను కామించి యపహరించినవాడు. కామభావమున కతీతమైనది సీతతో మాటాడినపు డెల్ల యతని మాటలలో గోచరించుచుండును.

నీవఖిలభవాంభోనిధి
నావవు నే నుప్పునీళ్ల నాసాకంత
వ్యావల్గువులుగ నుంటి కృ
పావేత్రము నిచ్చి నొడు పట్టింపగదే.

'అంబుజ సదృశంబు నీ చరణమోహనపీఠమునందు నాదుస
ర్వాజనిఫలంబు నర్పణము పట్టితి ముట్టితి శ్రీరహస్యమున్'

భక్తుడు తన యిష్టదైవమును ప్రార్థించినట్లున్న వీ పద్యములు. రావణుడే కాదు. రావణునికి సీతనుగూర్చి చెప్పిన యకంపనుడు గూడ సీతాస్వరూపమును దివ్యముగా వర్ణించినాడు. ఈ రాక్షసులకామెయందు భక్తియో లేక యామెను చూచినచో చాలును నిజము నోటివెంట యప్రయత్నముగా బయటపడునో,

'అమ్మధురావలోకనము లద్భుతమయ్యెడు సీతలోచనాం
తమ్ములు సాగినంతన శతప్రమితుల్ మధురేక్షుచాపఖం
డమ్ములవారు రత్నమకుటమ్ములవారు జగద్విలోభనా
స్యమ్ములవారునుం బ్రభవ మందెద మంబుదనీలరోచిషుల్'

## 10

నిగమమహార్థముల్ జగము నిండెను దన్నిగమాంతవైఖరుల్
నిగమచయంబుకన్న హావణించెను దన్నిగమాంతచూడమై
దగిలెను బ్రహ్మనాబడుపదార్థము బ్రహ్మము మౌళిసీతక్రొం
జిగురుపదంబు గోటిరుచిచే రుచిమంత మదెంతచిత్రమో.

సీత సౌందర్య మకంపనుడు చూచినాడు. ఆమె శరీర సౌందర్యము సరే. అద్భుతములైన ఆమె మధురావలోకనముల నెంతని వర్ణింప వలెను. ఆమె యపాంగరోచులు సాగినంత మేర వందలకొలది మన్మథులు - తియ్యని చెఱకు గడ విల్లుగా గలవారు. రత్నకిరీటముల వారు, జగత్తునకు లోభము కల్గించు ముఖ సౌందర్యము కలవారు, నల్లని దేహకాంతి గలవారు - ప్రభవమందు చున్నారు. ఆమె వట్టి యపాంగము వందలకొలది మన్మథులకు జన్మస్థానమగు

చున్నది. ఆ యందమును కొలచుట యెట్లు? కొలచుట కకంపనునికి శబ్దములు చాలలేదు. జగత్తులో పరమోత్కృష్టములైనవి వేదములు. నిగమాంతము లుపనిషత్తులు. అవి బ్రహ్మస్వరూపమును చెప్పును. ఆ బ్రహ్మలక్షణము ఆనందము. ఈ ప్రయత్నమంతయు ఆ యానందప్రాప్తికే కదా? ఈ వేదములు, వేదాంతములు, నిగమాంతచూడమైన ఆ బ్రహ్మపదార్థము అవన్నియు నెంచుటకు? ఏ బ్రహ్మము యొక్క మౌళి అనగా తల సీతయొక్క కాలిగోటిచే కాంతిమంతమగుచున్నదో ఆ సీతను పట్టుకొన్నచో బ్రహ్మానందము నీ అరచేతిలో నున్నది.

రాక్షసు డేయుద్దేశ్యముతో చెప్పినను చెప్పినది నిజము. సీత సర్వసృష్టికి మూలభూతమైన శక్తిస్వరూపము. కేవల సౌందర్యమును చెప్పబోయి అకంపనడు సీతాస్వరూప యాదార్థ్యమును వివరించినాడు.

## 11

లంకారాజ్యము నుంకువంగొనుము బాలా! పంక్తికంధుండు నీ
లెంకై నాల్గుకెలంకులం గెలుపు నీ లీలాపదాంకంబులన్
సుంకం బుంచెడు సూర్యదీప్తిసరదచ్ఛోదార్ద్ర మీనాంక ప
ర్యంకాకార కపోల కాంతి పరివాహా! కామభూమీరుహా!

సీతను లోభపెట్టుటకై లంకారాజ్యవైభవమంతయు చూపించిన తరువాత రావణుడు చివర కన్న మాటలివి. తాను పంక్తికంఠుడు, తన పదితలలు శివునికి కానుక పెట్టినవాడు. 'నిజముగ జూడు రామతరుణీ! శివునిం గికురించినాడ కంఠజనవరక్తవారి విలుఠత్పల మూర్ధము లే యొసంగి' ఇది తన గొప్పదనము. అంతటివాడను నీకు దాసుడనై నాల్గు దిక్కులలో గెల్చిన గెలుపులు నీ పాదములకడ సుంకమిడుదు నన్నాడు. ఆ రావణుడు సీతను పిలుచు పిలుపులు అతని యెదలోని సర్వమైన వాంఛను పట్టియిచ్చును. కామభూమీరుహా! యనును. కామభూమీరుహ మనగా కోరికలచెట్టు. అనగా కల్పవృక్షము. కామభూమియందు పుట్టుకొనివచ్చినదానా అనియు కావచ్చును. మరియు నామె కపోలములు మీనాంకుని-మన్మథుని-పర్యంకాకారములు గల్గినవట. ఆ కపోలముల కాంతి చిమ్మనగ్రోవిలోనుండి చిమ్మినట్లున్నది. స్వచ్ఛజలములు కలిగిన సరోవర

ములో సూర్యకాంతి ప్రతిబింబించినప్పు డాకాంతి యెంత మనోహరముగా నుండునో ఈ కపోల కాంతి యంత మనోహరముగా నున్నది. కపోలములు మీనాంకుని పర్యంకములని యూహించుట పరమ సుకుమారమైన విషయము. విశ్వనాథవారు వర్ణించుట యనగా నిట్లే యుండును వస్తువుయొక్క రూపమును కాదు. దాని వెనుకనున్న భావమును చెప్పుకు. అంతే కాక ఈ పద్యరచన దాని యంతట నదొక విశేషము. లంకా - ఉంకువ - పంక్తి - లెంక - కెలంకులు - పదాంకము - సుంకము - మాటిమాటికి బిందుపూర్వక కకార ప్రయోగము పద్య రచనలోని ధారాళతను రావణుని విలాసధోరణిని వ్యక్తీకరించుచున్నవి.

## 12

విరిసి మన్మథరాజు బిట్టావులించిన
యాకాశ మది రూప మందె నసగ
విరియమ్ముమ్మవాని విల్ ఫెళ్లున విరిగిన
పెనురావ మది మూర్తితనరె ననగ
శివదృగగ్ని నిపీత నవమన్మథశరీర
శిఖ యిట్టి యాకృతి చెందె ననగ
మన్మథదహన సంభవరతీబాష్పసం
తాన మీదేహంబు పూనెననగ

నన్నియును గూడియే యిట్టు లాయెనొక్కొ
యనగ లోచన సహజదర్శన సమగ్ర
శక్తియుపసంహృతిచ్ఛిదాచటులమగునొ
నానొకా నొక కామిని కానిపించె.

ఒకకామిని కనిపించినది. ఆమె శూర్పణఖ. తన సహజమైన రూపమును వదలి రామునకు మిక్కిలి అందమైన స్త్రీగా కనిపించుకొను ప్రయత్న మామె చేసినది రాముని మోహింపజేయుటకై వచ్చిన ఆమె రూపము నెంతైన వర్ణింప వచ్చును. ఆమె కేశపాశమును, వదనరాజీవమును, స్తనకాఠిన్యమును, జఘన

వైశాల్యమును, ఒకటేమిటి ఈ వర్ణనలో తెలుగుకవు లెవ్వరికి తీసిపోరన్నది సర్వవిదితము. కాని ఈ కవి యట్లు చేయడు. మన్మథు డావులించిన యాకాశమునకు రూపము కల్గినచో, వాని విల్లు విరిగినప్పటిధ్వని యొక రూపమును తాల్చినచో, శివుని కంటిమంటలలో యంటుకొనిన వాని శరీరశిఖ యొక యాకారమును చెందినచో, ఆ తరువాత దుఃఖించిన రతీదేవి కన్నీటికాల్వ లొక దేహమును పూనినచో యెట్లుండునో ఆమె రూప మట్లున్నది. ఆమె శరీరము నెంతసేపు వర్ణించినను ఈ నాల్గుమాటలలో చెప్పిన భావము రాదు. పాపము ! ఇంత ప్రయత్నము చేసి ధరించిన రూపములో యొకలోప మున్నది. అది యామెకు సహజము కాదు. ఇంత మన్మథమయముగా దాల్చినరూపము 'లోచన సహజ దర్శన సమగ్రశక్తి యుపసంహృతిచ్ఛిదాచటుల' మగునట్లున్నది. కన్నులకున్న సహజదర్శన సమగ్రశక్తి యొక్క ఉపసంహారమును ఛేదించునది. అనగా అసహజమై చూపులకు వెక్కసమై కనులకు బరువుగా నున్నదని తాత్పర్యము'

ఈ శూర్పణఖ కథ మొత్తము ఒక విశిష్ట రచనా పద్ధతిని సూచించుచున్నది. ఇంతగా వేషమును సంతరించుకొన్న శూర్పణఖ ఇపుడు రామునితో మాటాడవలయును. తన రాక్షసత్వము బయల్పడకుండ మృదువుగా మాటాడవలయును. అట్లు మాటాడుట తనకు సహజము కాదు. ఐనను ప్రయత్నము చేయుచున్నది.

> 'తొలకరిɛ మొయిలు తూగుచున్నదో
> అలసతɛ నెమలి యాడుచున్నదో
> సొలయకɛ జివురు చూచుచున్నదో
> అలరువింటిదొర వౌదువా మునీ !'

ఇంత మృదువుగా, సుకుమారముగా, ప్రసన్నముగా మాటాడుగ శూర్పణఖ ప్రకృతికి దూరమైన విషయము. ఒకటి రెండు మాట లిట్లు మాటాడినదో లేదో ఆమె వాగ్ధోరణి మారినది.

> 'ఏదీ రావణు డన్న రాక్షస ధరాభృత్స్వామి విన్నావటో
> అదైత్యేశ్వరు పట్టపేగ్గువలె నీ యాకార మేపారుగా
> దాదైత్యద్వీపరాజు హుంజిలుగు హాదావోలె నున్నాను నే
> నీ దాంపత్యపు సౌరు చూడగదవోయీ మౌనిరాణ్మన్మథా.'

మొయిలు తూగుచున్నట్లు, నెమలి యాడుచున్నట్లు, చివురు చూచుచున్నట్లున్న దన్న రాముని యాకారము రాక్షస రాజైన రావణుని పట్టపేనుగువలె నున్నదను చున్నది. ఊహలలో సౌకుమార్యము పోయి మోటుతనము వచ్చుచున్నది. నీవు పట్టపేనుగవు. నేను దానిపైని హౌదాను. ఏమీ దాంపత్యపు సౌరు ? ఈ యూహ కొంత సాగినంతనే మార్గము తప్పినానని శూర్పణఖ తెలిసికొన్నది.

"అని నాలుక కొఱికికొని"

'నలి నూనె లేని తల నార చీరలుఁ
తెలియంగ నీ యెడ నదేమియందమో
ఎలగోలు మూకమును లెంతమంది లే
రిలలోన వారలకు నీవు రాజవో'

'జలజల నల్లని తల తల
వెలుగులు రాలెడిని నల్లవిసె పూచెడినో
తెలిసెను నీమైచిక్కని
వెలుగులు కనులంట పొడిచె జిమ్మనక్రోవై.'

ఇది మరల నామె మృదుస్వరకల్పనకై చేసిన యత్నము. కాని ప్రకృతి దురతిక్రమముగదా ! సహజధోరణి మరల విజృంభించినది.

'భర్గశ్రీగళకాంతిభావపరిదీవ్యత్ దైత్యరాజ్యేందిరా
దుర్గద్వారకవాటమోహన కళాదుర్వార మీవక్షము-'
'ఘోషాకంపిత కేసరోగ్రహరి సంక్షుభ్యద్వలగ్నేందిరా
దోషారోపణ శీల మీనడుము-'

ఇట్లు. రచన దానియంతట నది మధురమో కఠినమో యగుటకాదు. సందర్భమునుబట్టి మాధుర్యము కాఠిన్యమును.

## 13

ఓహో ! మూడవవాని జూపుము సమస్తోర్వీభరంబున్ ఫణా
వ్యూహంబందు నటో యిటో యొరుగగా నూనంగనై నట్టి శే
షాహిం దక్కఁగ వింశతి ప్రభుభుజాహంకార సంభార రే
ఖా హేలాధృత శైవ పర్వత భుజాస్కంధున్ ననున్ దక్కఁగన్.

ఇది సీతాహరణార్థము వచ్చిన రావణుడు సీతతో తన గొప్పతనము చెప్పుకొనుచున్న పద్యము. ఇరువది సమర్థములైన భుజములయొక్క అహంకార రేఖ ద్యోతమానమగునట్లు వట్టిహేలగా కైలాసపర్వతము నెత్తినవాడను నేను· నాకు మరొకడు సాటియా ? ఐనచో కొంతవరకు శేషుడు కావచ్చును. ఆయన చేసిన దేమి ? తన ఫణావ్యూహమందు భూమిని దాల్చుటకై మహాప్రయాస పడి అటో యిటో యొరుగగా దాల్చినాడట. నిలువుగా ధరించుట చేతకాలేదు. ఇరువది భుజములతో కైలాసపర్వతము నెత్తుటలోని తన సునాయాసత, వేయి పడగలతో భూమిని మోయుచున్న శేషుని మహాయాసత స్పష్టపడునట్లుగా 'అటో యిటో యొరగగా నూనంగనైనట్టి', 'హేలాధృతశైవపర్వత భుజాస్కంధున్' అను మాటలతో రావణుడు స్పష్టపరచుచున్నాడు. పోనీ కొంతవరకు శేషుని పోలికగా దీసికొందము. మరి మూడవవా డేడీ ? ఇది రావణుని యౌద్ధత్యము. పద్యము మొదలుపెట్టుటలోనే, "ఓహో ! మూడవవానిజూపు" మనుటలోనే, రావణుని యహంకారము, ఎదుటివానిని లెక్కచేయనితనము స్పష్టమగుచున్నది.

## 14

నీవు న్నీపతి యిద్దఱా యిచట ? బండెం బాప మీయంద మే
మీ ! విశ్వేశ్వర ! కానలో నునికి యేమీ ! భీతి కాదేమి ? మీ
రీవేరై చనుచోట కట్టితిరి పూరి ల్తోడులేకుండ త
న్వీ ! వా ర్వీరని పిల్వగా నయినలేదే యేదియే న్వచ్చినన్.

సన్యాసివేషముతో వచ్చిన రావణుడు సీతతో జరుపుచున్న సంభాషణ యిది. సంభాషణలు విశ్వనాథవారి పద్యములలో పరమసహజముగా నుండు ననుటకు తార్కాణము.

## 15

తానై చూచిన నేది కల్గునో హృదంతఃప్రీతి తత్ప్రీతి న
ట్లై నీకుం ఘటియిల్ల చేయుటకై యత్నంబు గావించు వా
క్స్థానం బావచియింపగాబడిన దాధారంబుగా నీవు చి
త్స్థానం జూచిన మాయలేడి దగు సౌందర్యంబు సువ్యక్తమా.

మాయలేడియొక్క అద్భుతరూపమును వర్ణించి వర్ణించి చివరకు కవి చెప్పిన మాట యిది. ఒక మహాద్భుతమును గూర్చి యెంత చెప్పినను ఇంకను చెప్పవలసినది మిగిలియే యుండును పరమ సుందరమైన దృశ్యము నొకదానిని చూచితిమి. ఒక మహాభావము ననుభవించితిమి. దానివలన కల్గిన హృదంతః ప్రీతిని పరులకు కల్గింపజేయుట యెట్లు? అట్లు కల్గించుటకై ప్రయత్నము చేయునది వాక్కు. ఆ చెప్పబడినదాధారముగా శ్రోత ఆ దృశ్యమునో ఆ భావమునో తన చిత్తమునందు దర్శింపవలయును. అప్పుడుగాని ఆ సౌంద ర్యము సువ్యక్తము కాదు.

ఇది కేవలము మాయలేడికి సౌందర్యమునకు సంబంధించినది మాత్రమే కాదు. కావ్యరసాస్వాదనకును సంబంధించిన విషయము. కవి తాను దర్శించిన దానిని తన వాగ్వైభవము మెరయ వెలువరించును. ఆ వెలువరించినది కేవల శబ్దార్థపర్యాప్తము కాదు. ఆ వచియింపగాబడిన దాధారముగా కావ్యపాఠకుడు మననముచేసి కవి ఊహను సాక్షాత్కరింపజేసికొనవలెను. అప్పుడుగాని కవి యూహ యొక్క అద్భుత సౌందర్యము గోచరించదు.

## 16

శివమహోకార్ముకచ్ఛేత్త యెవ్వాడని
కన్నతండ్రికిని దుఃఖంబు తొలుత
శివమహోకార్ముకచ్ఛేత్త వీడంచు భా
ర్గవరామునకును దుఃఖంబు పైన
తగ మహాటవి చంకతాళివి మరి తాళి
కట్టినవాని దుఃఖంబు మరియు
నీ వన్న దలమున్కలౌ వలపైన రా
క్షసరాజునకును దుఃఖంబు పెచ్చు

ఇంక మామాట చెప్పగా నేల రేపు
వరుగు తిరిపించెదవు మమ్ము పరమదుఃఖ
మయవిచిత్రలోకేశ్వరీ! మాయవై సు
ఖంబు చూపించెదవును దుఃఖంబు నెఱపి.

సీతకు కాపలా కాయుచున్న రాక్షసస్త్రీలు సీతను నిందించిన పద్యమిది. ఈ సీతవల్ల సుఖ మెవరికి కలిగినది ? మొదటినుంచియు దుఃఖమే. శివుని విల్లు విరుచువాడు దొరకినగాని సీతకు పెండ్లి కాదు. ఆ శివ మహాకార్ముకచ్ఛేత్తకై ఎదురుచూచుటలో జనకునికి కలిగిన మనఃక్లేశమునకు కారణము సీత. ఆ తరువాత అయ్యో ! వీడు శివుని విల్లువిరిచినాడే యని పరశురామునికి దుఃఖము ఇక తాళికట్టినవానికి అటవీ మధ్యములో చంకతాళివైన నీ వలన కలిగిన దుఃఖమా చెప్పనలవికానిది. తలమునుకలుగా వలపైన రావణుని దుఃఖతీవ్రత ప్రత్యక్షము. ఇంతింత మహానుభావులకే దుఃఖము కలిగించు నీకు మా లెక్క యేమి ? శుష్కించిన నీ దేహము వరుగువలె తినుటలో దుఃఖముకాక యానంద ముండునా ? ఇదంతయు రాక్షసస్త్రీలు చేయుచున్న యాక్షేపణ. ఇంత యాక్షేపణలో నొక విచిత్రమైన, పద్యమునకు ప్రాణభూతమైన సంబోధన దొరలినది. 'పరమ దుఃఖమయ విచిత్ర లోకేశ్వరీ !' యనునది. కలిగించునది దుఃఖము. చూపించునది సుఖము. దుఃఖమందు సుఖభ్రాంతిని కల్గించుచున్నది సీత. ఇది మాయాలక్షణము దుఃఖమయమైన ఈ జగత్తును వదలజాలకున్నాము మనమందరమును. ఎందువలన ? ఏదో యొక సుఖభ్రాంతి దీనియందు మన కున్నది. సుఖమునకై ప్రయత్నము చేయుదుము. కలుగునది క్లేశము. దానిని పోగొట్టుటకై మరింత యత్నము చేయుదుము. మరికొంత క్లేశము కలుగును ఇది వరుస. నిందించుచున్నను నిజమే పల్కుచున్నారు రాక్షసస్త్రీలు.

## 17

మాతృదేవీ సమాజ్ఞాతీర్థ సుస్నాత
　　　　వినతాతనూజుండు వేల్పుబువ్వ
కనుగొన్నయట్లుగా గనుగొంటి జానకీ
　　　　దేవి గవేషణాతీర్థఫలము
పరమ యాజ్ఞికులు నిర్భరమహోచ్ఛందోఽవ
　　　　తారంబు గాయత్రి తత్త్వమూర్తి
గనుగొన్నయట్లుగా గనుగొంటి జానకీ
　　　　దేవి శ్రీరఘురామధీపదంబు

కవిమహర్షి తపోఽగ్నిచే గ్రాగికాగి
సర్వతేజఃఫలంబు రసంబు తుదకు
చూచినట్లుగ జూచితి క్షోణిజాత
చారితార్థ్యంబు జన్మకు సంఘటింప.

ఇది హనుమంతు దన్నమాట. సీతాన్వేషణలో హనుమంతుడు పడినశ్రమ సాటిలేనిది. జానకి తన గవేషణాతీర్థఫలము. ఆమె రఘురాముని దీపదము. ఆ తీర్థఫలమును తాను కనుగొన్నాడు. ఎట్లు? తల్లియొక్క ఆజ్ఞాతీర్థమందు మునుకలాడిన గరుత్మంతుడు అమృతము నెట్లు కనుగొన్నాడో తానట్లు జానకిని కనుగొన్నాడు. ఛందోఽవతారమైన గాయత్రిని పరమయాజ్ఞికులు దర్శించి నట్లుగా తాను రాముని దీపదమైన సీతను దర్శించినాడు. అంతే కాదు. తపోగ్నిచే కాగిన మహర్షియైన కవి సర్వతేజఃఫలమైన రసమును చివర కెట్లు దర్శించునో తానట్లు సీతను దర్శించినాడు. ఆ గరుత్మంతుని జన్మకు అమృత సంపాదనము చారితార్థ్యము. ఆ పరమయాజ్ఞికునకు గాయత్రీదర్శనము చారితార్థ్యము. తన జన్మకు జానకిని చూచుట చారితార్థ్యము. ఆ మాటయే సీతతో ననినాడు.

'ఆ యొకమాటచెప్పగదవమ్మ! మరిన్ రఘురాముభార్యవే
నా! యజనార్థలాంగల ముఖాగ్ర ధరా వివృతిప్రసూతివే
నా! యలశైవచాపదళనాద్భుతకార్యఫలాయితోర్మివే
నా! యవు నన్ను జన్మ చరితార్థముగా దలపోసికొందునే.'

తన జన్మకు ఇంతప్ప మరొక ప్రయోజనము లేదని ఆ కపీశ్వరుని విశ్వాసము. తాను చూచుచున్నది సీతయే. అనేక విధములుగా తర్కించి తర్కించి ఆమె సీతయే యని ఇదివరకు దృఢపరచుకొన్నాడు. తా ననుకొనుటయేకాని ఆమె నేను సీత నని ఇదివరకు చెప్పలేదు. ఆమె సీతకానిచో తనజన్మ వ్యర్థము. సీత యైనచో తనజన్మ చరితార్థము. అందుచేత అనేకవిధములుగా ఆమెను ప్రశ్నించినాడు. ఏ మాట వినుటకై తానింత సముద్రమును లఘించెనో ఆ మాట ఆమె నోటివెంట వినవలయును. అమ్మా! ఆ యొక్కమాట చెప్పవమ్మా! నీవు సీతవేనా? రఘురాముని భార్యవేనా? భూదేవి కూతురువేనా? అతని గుండెలోని తొందరయంతయు పద్యములో వ్యక్తమగుచున్నది.

అప్పు డన్నది సీత-
'అవు నేను రాముభార్యనె
అవు రాఘవు ధర్మపత్ని నగుదుస యాచా
పివనిత నావనవాసికు
లవధువు నాధర్మవీరులలనను గంటే.'

ఆత డెన్నివిధముల యడిగినాడో యామె యన్నివిధముల సమాధానము చెప్పినది. సీతాదర్శనముతో హనుమంతుని జన్మ చారితార్థ్యము నందినట్లు రామాయణ రచనతో విశ్వనాథ జన్మము చారితార్థ్యము నందినది.

సద్యోనిర్గతమైన సర్వకవితా సంభారమున్ నీకు నై
వేద్యంబిచ్చితి రామచంద్ర! ప్రభువా! విశ్వాసముం బూనవే
యాద్యంబై చను జీవలక్షణము సంహారంబు గావింపవే
హృద్యంబై చను నీదు తేజమును సారింపంగదే గుండియన్.

ఇది యాయన ప్రార్థన.

తెలుగు ఎదలో తెలుగుతనం

వెల్లువలా పారాలని

తెలుగింటిలో తెలుగుదీపం

అఖండంగా వెలగాలని

ఈజాతి నిదురలేచి

మహోన్నత మానవాదర్శాల వైపు

నిరంతర కృషితో

పయనం కొనసాగించాలనే ధ్యేయంతో

ఉడుతాభక్తిగా యువభారతి కృషి చేస్తున్నది

భాషాభిమానం కలగాలంటే

మాతృభాషా సాహిత్య పఠనమే

ప్రథమ కర్తవ్యం అనే భావం

బలంగా మనసులో నాటుకోవటానికి గాను

వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు

ఉత్తమసాహిత్యం అందిచేందుకు

యువభారతి పూనుకున్నది.

ప్రతి తెలుగింటిలో

కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు

మనందరం ఉద్యమ వేగంతో కృషి చేద్దాం.

ఆ పదిమంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా

యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా

ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం.

**యువభారతి**

**సాహితీసాంస్కృతికసంస్థ**
**5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3**